**ధ్యానం :-**

**అతిరౌద్రీ మహాదంష్ట్రా కృశాదీర్ఘా కృశోదరీ**
**ప్రమత్త నయనాశూరా దీర్ఘఘోణా మదాన్వితా**
**స్నిగ్ధ గంభీరనిర్ఘోషా నీలజీమూత సన్నిభా**
**భ్రుకుట్యాగ్నివ సందీపా మహావదన భీషణా**
**దక్షాష్టా కోపతామ్రోష్ఠి రక్తదీర్ఘ తనూరుహా**
**త్రిశూలై రుగ్రదో ర్దండా నరకీట పలాశినీ ॥**
**అతిరక్తాంబరాదేవ రక్తమాంసా సవప్రియా**
**శిరోమాలా విచిత్రాంగీ పిబంతీ శోణితాసవం ॥**
**నృత్యంతీచ హసంతీచ పిశాచగణ సేవితా**
**పిశాచస్కంధ మారుహ్యా భ్రమంతీ వసుధాతలం ॥**
**శంకరస్య ముఖోత్పన్నా యోగినీ యోగవల్లభా**
**ఇత్థంభూతా భద్రకాళీ మాతృభిః పరివారితా ॥**

ధూమవతీవలెనె న్యాసాదులు చేయవలయును. త్రికోణకుండ మందు విషవృక్ష సమిధలతో హోమం **రుద్ర దండప్రయోగవిధి** గురుముఖముగా గ్రహించవలయును. ఇది సర్వశత్రువులను నాశనము చేయును. ఇది సామాన్య మంత్రవేత్తలు ఆచరించరాదు.

**❖ భద్రకాళి మంత్రం–హౌం కాళీమహాకాళీ కిలికిలి ఫట్ స్వాహా ॥**

**ధ్యానం :-**

క్షుత్ క్షామా కోటరాక్షి మపిమలిన ముఖీముక్తేహేశీరుదంతీ ॥ నాహంతృప్తా వదంతీ జగదఖిల మిదం గ్రాసమేకం కరోమి ॥ హస్తాభ్యాం ధారయంతీ జ్వలనిల శిఖాసన్నిభం పాశముగ్రం ॥ దంతైర్జంబూ ఫలాభైః పరిహరతు భయం పాతుమాం భద్రకాళీ ॥





ధర్మ కామార్థసిద్ధికి శత్రునిగ్రహమునకు దీనిని జపించవచ్చును.

**❖ దక్షిణ కాళికా మంత్రం– క్రీంక్రీంక్రీం హూం హూం హ్రీం హ్రీం దక్షిణే కాళికే క్రీంక్రీంక్రీం హూంహూంహ్రీం హ్రీం స్వాహా॥ ఇది 22 అక్షరముల మూలమంత్రము. దీనికి సిద్ధారిశోధన అవసరము లేదు.**

జపమునకు సమయా సమయములు లేవు. సకల పాపములు హరించి సకలశుభములను, వాంఛితార్థముల నిచ్చు మంత్రమిది. రాత్రియందు నగ్నముగా శయనించిగాని మైథునమందుగాని, జటలు విరబోసుకుని జపంచేయాలి. సర్వవిద్యలు అలవడును. పదివేలు జపించిన సిద్ధించును. ఋతుమతి అయిన స్త్రీభగమును చూచుచు, 10వేలు జపించాలి. స్మశానమందు దిగంబరముగా జపించిన పాపములు తొలగి కామ్యసిద్ధి కలుగును. షట్కర్మలూ సాధించవచ్చు. తెల్లజిల్లేడుపూలు తనరేతస్సుతో తడిపి 1000 స్మశానంలో హోమం చేస్తే సర్వసిద్ధులు కలుగును. ప్రథమాహుతి మహాకాలునికి సమర్పించాలి. **బ్రాహ్మణులు పగటియందు జపించాలి.**

మూడుత్రికోణములు–1నవకోణం–అపై 8 దళములు 4 ద్వారములతో యంత్రము నిర్మించాలి. కాళీ–కపాలినీ–కుళ్ళా మొదటి త్రికోణము కురుకుల్లా–విరోధినీ– విప్రచిత్తా 2 త్రికోణ ఉగ్రా– ఉగ్రప్రభా–దీప్తా–3 త్రికోణం బ్రాహ్మీ–నారాయణీ–మాహేశ్వరీ– చాముండా–కౌమారీ అపరాజితా–వారాహీ–నారసింహీ–8 దళములతో పూజించాలి అంగన్యాసములుచేయాలి. బలి–నైవేద్యం– నైఋతిలో ఇవ్వాలి. పగలు శుచిగా హవిర్భుజియై 1 లక్ష జపం చేయాలి. రాత్రి అశుచిగా 1లక్ష జపంచేయాలి. దశాంశ హోమతర్పణాదులు మామూలుగా చేయాలి.

ఈ మంత్రమునకు భైరవృషిః త్రిష్టుప్ చందః। స్మశాన కాళికా దేవతా। క్రీం బీజం॥ హూంశక్తిః సకల సిధ్యర్థే వినియోగః ॥

**❖ ఉగ్రతారా మంత్రం-హ్రీం స్త్రీం హూంఫట్ ధ్యానం-ప్రత్యాలీఢ పదార్పితాంఘ్రి శవహృత్ ఘోరాట్టహాసా పరా॥ ఖడ్గేందీవర ఘోరఖర్పరభుజా హూంకార బీజోద్భవా॥ ఖర్వానీల నిశాల పింగళజటా జూటోగ్ర నాగైర్యుతా జాడ్యం న్యస్య కపాలకే త్రిజగతాం హంత్యు గ్రతారాస్వయమ్**

ఈ మంత్రజపమునకు దేశకాల నియమములు లేవు. గద్య-పద్యమయమైన వాక్కు-సభాజయం సిద్ధిస్తాయి. గొప్పవారందరూ దాసులవుతారు. స్నానం చేయకుండా భోజనంచేసి జపంచేయాలి. మహానిశిలో శుచిగా బలి (నైవేద్యం) ఇవ్వాలి. స్త్రీద్వేషం పనికిరాదు. స్త్రీలను పూజించాలి. సుముఖం-చతురస్రం-వృత్తం-గోముఖం- యోని ముద్రలనే పంచముద్రలు ప్రదర్శించాలి. మంత్రమును- మంత్రోపదేశము చేసినగురువు నామమును రహస్యముగా నుంచవలయును. బహిర్గతము చేసిన విద్య బలహీనమగును. తంత్రికంటే గురువు గొప్పవాడు. మహాశంఖమాలచే జపించిన శీఘ్రసిద్ధి.

**❖ ఏకాజటా బలిమంత్రము-ఓం హ్రీం ఏకజటే మహాయక్షాధిపతయే మయా ఉపనీతం బలిం గృహ్ణం గృహ్ణ గృహ్ణాపయ గృహ్ణాపయ మమ సర్వశాంతి కురు పరవిద్యాం కృష్య ఆకృష్య త్రుటం ఛింధిఛింధి సర్వజగద్వశమానయ హ్రీంస్వాహా ॥**

ఈ మంత్రముతో నాలుగురోడ్ల కూడలియందు ప్రతీరోజూ రాత్రి 12 గం॥ బలి సమర్పించవలయును.

**మూలమంత్రము-ఓం పద్మే పద్మే మహాపద్మే పద్మావతీ హ్రీంస్వాహా ॥**

**మహాకాళీ మంత్రము-ఓం ఫ్రేంఫ్రేం హూం హూం పశుంగృహాణ హూంఫట్ స్వాహా ।**





**ధ్యానం :-**

**పంచవక్త్రాం మహారౌద్రీం ప్రతివక్త్ర త్రిలోచనాం
శక్తిశూల ధనుర్బాణ ఖడ్గఖేట వరాభయాం ॥
దక్షాదక్ష భుజైర్దేవీం బిభ్రాణాం భోగిభూషణాం
అర్ధచంద్ర జటాయుక్తాం జిహ్వాలలన భీషణాం ॥
నిర్మాంసమే ధవామస్థి పంజరాం ముండమాలినీం
మత్తవ్యాలోప వీతాంగీం భూతభేతాళ వేష్టితాం ॥
మేదోవసా విలిప్తాంగీం మహాప్రేతాధి రూఢకాం
ధ్యాత్వైవం సిద్ధిదం సాధ్యం సాధయేన్మనసి స్థితం ॥**

నల్లని కుండలో నల్లనినీళ్ళు నింపి మహాకాళిని ఆహ్వానించి, పూర్వాది ఈశానపర్యంతం అష్టమాతృకలను పూజించాలి. గృహమందుగాని, స్మశానమందుగాని విభీతక సమిధలతో అపహ్ణంలో హోమంచేసిన శత్రూచ్చాటన మగును దక్షిణాముఖంగా చేయాలి.

**❖ పరిమళ మంత్రము-రుద్రజాయా మహాయోగినీ గౌరీ భువన భయంకరీ హుం ॥**

**అంగిరా ఋషిః॥ గాయత్రీ చందః**

**ధ్యానం :-**

**సింహాసనాం కృష్ణముఖీం లంబమాన పయోధరాం
దంష్ట్రా కరాళవదనాం త్రినేత్రాం సర్వతోజ్జ్వలాం।
కృష్ణ కంచుక సంవీతాం విధూమాగ్ని సమప్రభాం
త్రిశూల చక్రముసల ఖట్వాంగ కరపంకజాం ॥
లేవిహానాం మహాజిహ్వాం విద్యుత్రేక్షణ భీషణాం
ధాత్వా కృత్యాం విధానేన పూజయే న్మంత్ర విత్తమః ॥**

వశీకరణ ప్రయోగమునందు ఎర్రని పుష్పములను ఉపయోగించ వలయును.

**కృత్య-మదనా-సర్వకుల్లా-స్వచ్ఛాదినీ-భీషణా-శ్రీమతీ-ప్రతిష్ఠా-పరా-**అను పరివార దేవతలను అష్టదళములందు స్థాపించ వలయును.

**పూర్వేతు-శాంకరీం-శుక్లావర్ణాంబరానితాం**
**ద్విభుజాం సౌమ్యవదనాం పాశాంకుశ ధరాం శివాం ॥**
**దక్షిణే-భీషి కాం-నామ లలజ్జిహ్వాం సుధాముఖీం**
**కృష్ణవర్ణాం రక్త కేశం రక్తమాల్యాను లేపనాం ॥**
**చతుర్భుజాం సింహనాద జ్వలచ్ఛాల కపాలినీం**
**ఖడ్గహస్తాం శిరోమాలాసర్వాభరణ భూషితాం ॥**
**పశ్చిమే-వారుణీం-స్వర్ణవర్ణాం హసన్ముఖీం**
**సువర్ణమాలికం శుభ్రదంష్ట్రా మభయదాం సదా**
**ఉత్తరే-భీమికాం-చతుర్వర్గ భయంకరాం**

అని 4 దిశలందు పూజించి రోజూ 108 మంత్ర జపం చేయాలి.

❖ జయదుర్గా మంత్రం-ఓం దుర్గేదుర్గే రక్షే స్వాహా హూంహూంహుం ॥

మరొక మంత్రం-ఓం నమోభగవతి జ్వాలామాలిని గృధ్ర గణపరివృతే స్వాహా ॥

మరొక మంత్రం-ఓం నమోభగవతి జ్వాలామాలిని గృధ్ర గణపరివృతే స్వాహా ॥

ఇది 23 రోజులు రోజూ 8వేలు జపించాలి.

**ధ్యానం :-**

కృష్ణాం త్రిలోచనాం శంఖచక్ర శూలాసిధారిణిం

జ్వాలాముఖీం భీమరూపాం ధ్యాయేత్ త్రైలోక్య భీతిదామ్ ॥ సర్వశతృజయం కలుగును.





ఆగ్నేయం-జాతవేదసే సునవామ సోమమరాతీయతో నిదహాతి వేదః సనః పరిషదతి దుర్గాణి విశ్వానావేవ సింధుందురితాత్యగ్నిః ఇది 44 అక్షరములు కాశ్యప ఋషిః త్రిష్టుప్ ఛందః । జాతవేదోగో అగ్నిర్దేవతా

జాతవేదసే-సునవామ హృదయాయ నమః
సోమరాతీయతో-శిరసే స్వాహా
విదధాతి వేదః-శిఖాయై వషట్
సనః పరిషదతి-కవచాయ హుం
దుర్గాణి విశ్వానావేవ-నేత్రత్రయా వౌషట్
సింధుం దురితాత్యగ్నిః-అస్త్రాయ ఫట్
మాతృకాన్యాసం కూడా చేయాలి.

ఇది విలోమంగా పఠించిన ఆగ్నేయాస్త్రమగును. 8 పాదము లున్నవి.

గ్నిఃత్యతారిదు-ఇది జ్ఞానేంద్రియాత్మకం
ధుంసిం వనేనా-ఇది కర్మేంద్రియాత్మక
శ్వావిణిర్గాదు-ఇది పంచభూతాత్మకం
తి-ఇది విడచిపెట్టాలి.
దఃవేతిహాదని-
తోయతీరామమ-షట్కోశ మయము
సోమవానసు-శబ్దాది మయము
సేదవేతజా-వాగాది మయము.

ఇందు ఇంద్రియోత్పన్న దేవతలు ప్రజ్వలత్ కేశవదనము కలవి భీమదంష్ట్రలు. భయంకరమైనవి. ఊర్ధ్వసృష్టి గలవి. భూతములనుంచి ఉద్భవించినవి తిర్యగ్ వక్రములు గలవి. ఊర్మిరూపము ఊర్ధ్వవదనములు గలవి, కోశోద్భవములు తిర్యగాననములు గలవి. అస్త్రం ప్రయోగించునపుడు మనుష్య నక్షత్రములైన పూర్వాత్రయం, ఉత్తరాత్రయం భరణి-ఆర్ద్ర-రోహిణీలయందు ఆరంభించి రాక్షస నక్షత్రములైన జ్యేష్ఠ-శతభిషం-

మూల–ధనిష్ఠ–ఆశ్లేష, కృత్తికా–చిత్త– మఖ–విశాఖలయందు ప్రయోగించాలి. దేవతా నక్షత్రములలో ఉపసంహరించాలి. (అశ్వినీ–రేవతీ–పుష్యమీ–స్వాతీ–హస్తా– పునర్వసుః–అనూరాధా–మృగశిరః శ్రవణం) మంగళవారం ఉపక్రమించి శనివారం విసర్జన చేయాలి. గురు–శుక్రవారములలో ఉపసంహారం చేయాలి. కృష్ణపక్షములో ప్రయోగించి, శుక్లపక్షములో తిరిగి గ్రహించాలి. పశ్చిమాభిముఖంగా హోమం చేయాలి. సింహాధిరూఢ అయిన దుర్గను, శతృవును తరుముతున్నట్లుగా భావించి, అగ్ని జ్వాలలను నోటినుండి వదులుతున్నట్లుగానున్న దుర్గను ధ్యానించి, వేడినీరు తర్పణచేసినచో శతృూచ్చాటన మగును.

శనివారంరోజున రావిచెట్టు స్పృశించి జాతవేదసే . . . . . . దుర్గామంత్రము జపించిన ఇష్టసిద్ధి కలుగును. గాయత్రీ మంత్రయుక్త దుర్గామంత్రము మహాసిద్ధి కలిగించును. (క్రూర గ్రహ బాధ నివృత్తికై కంటవృక్ష సమిధలను ముశ్శతో సహా గోమూత్రముతో హోమం చేసిన బాధలు తొలగును. రావి–మర్రి–మేడి ఇవి క్షీరవృక్షములు అనబడును. వీటి సన్నిధియందు క్రమానుసారముగా హోమం చేయాలి. తేనెతో హోమం చేసిన జగద్వశ్యమగును. మోదుగ చెట్టును స్పృశించి జపించిన ఉపద్రవములు తొలగును. మోదుగ సమిధలతో హోమం చేసిన బ్రహ్మ వర్చస్సు కలుగును.

❖ మహారాత్రి భద్రకాళీ మంత్రము–ఓం చిటీచిటీ చాండాలి మహాచాండాలి అముకక్తంమే వశమానయస్వాహా ।

ధ్యానం–టకం కపాలండమరుం త్రిశూలం సంబింభ్రతీం చంద్రకళావతంసా ॥ పింగోర్ధ్వ కేశీ సితధూమ నేత్రాభూయ ద్విభూత్యై మమ భద్రకాళీ॥ బొడ్డువరకు నీటిలో నిలబడి మంత్రజపం చేయాలి. అనంతరం 1008 జపం వల్ల సాధ్యవ్యక్తి వశమగును. రాగిరేకుపై సాధ్యవ్య క్తిసంపుటితో వ్రాసి చంద్రనిప్పులపై కాల్చిన 1 నెలలో వశ్యమగును.





❖ ధూమావతీ మంత్రము – ధూంధూం ధూమావతీ ఠఃఠః ॥ షట్కోణ యంత్రములో ధూంధూం గర్భములో సాధ్యనామముంచి ధూమావతీ స్వాహా అని కోణములలో ఉమ్మెత్తఆకు రసముతో వ్రాసి మృతదేహమునకు చుట్టిన వస్త్రముతో కట్టి రుద్రభూమిలో పాతిన ఉచ్చాటన మగును.

# భూతలిపి

యంత్రములద్వారా వాంఛితము కోరువారు ముందుగా మాతృకా సరస్వతిసిద్ధి పొందవలయును. భూతలిపి నేర్చుకొని, అక్షరముల అనుగ్రహశక్తి పొందిన వారు వ్రాయు యంత్రములే ఫలించును.

**ధ్యానం :–**

అంకోన్ముక్త శశాంక కోటిసదృశీ మాపీన తుంగస్త నీం॥ చంద్రార్థాంకిత మస్తకాం మధుమదాం వ్యాలోల నేత్రత్రయాం॥ భిభ్రణామనిశం వరం జపవటీం విద్యాం కపాలంకరైః॥ ఆధ్యాం యౌవన గర్వితాం లిపితనుం వాగీశ్వరీమాశ్రయే ॥

భూతలిపి మంత్రము–అం ఇం ఉం ఋం ఒం ఏం ఐం ఓం ఔం హం యం వం రం లం జం కం ఖం ఘం గం ఙం చం ఛం ఝం జం ణం టం ఠం ఢం డం నం తం థం ధం దం మం పం ఫం భం బం సం షం శంసం బంభం పంమం దం ధం థం తంనం డంఢం ఠంటం ణం జంఝం ఛంచం ఙం గం ఘం ఖం కం జం లంవం రంయం హంఔం ఓంఐం ఏం ఒం ఋం ఉం ఇం అం॥ దీనిని శతావృత్తి జపించిన సిద్ధించును.

❖ ప్రాణాకర్షణ మంత్రం – అం హ్రీంక్రోం యం రం లం వంశం షంసం హంసః దేవస్య ప్రాణాః ఇహ ప్రాణా దేవస్య జీవః ఇహస్థితః దేవస్య సర్వేంద్రియాణి, వాంగ్మన చక్షు శ్రోత్రఘ్రాణాః ఇహగత్య సుఖం చిరంతిష్ఠంతు స్వాహా ॥

# మంత్ర సంస్కారములు

మంత్రములు శీఘ్రముగా సిద్ధించుటకు శాస్త్రములో దశవిధములైన సంస్కారములు చెప్పబడినవి.

1.జననం 2. జీవనం 3. తాడనం 4. బోధనం 5. అభిషేకం 6. విమలీకరణం 7. అప్యాయనం 8. తర్పణం 9. దీపనం 10.గుప్తి.

1. జననం-మూలమంత్రమును మాతృక మధ్యయందుంచి జపించిన జననమను సంస్కారము జరిగి మంత్ర జపమువలన సిద్ధి కలుగును. 2. రెండు వైపులా ప్రణవము చేర్చి జపించుట జీవనమగును. 3. మంత్రమును భూర్జ పత్రముపై లిఖించి చందన గంధజలముతో కొట్టిన తాడనమగును. 4. మంత్రమును పత్రముపై లిఖించి మంత్రాక్షర సంఖ్యగల కరవీర పుష్పములచే కొట్టినబోధనం 5. రావిచిగురుల జలముతో అభిషేకించిన అభిషేకమగును. 6. ఓం హ్రౌం జ్యోతిర్మంత్రముతో జపించిన విమలీకరణం. 7. కుశోదకముతో ప్రతీఅక్షరమూ ప్రోక్షించిన ఆప్యాయనమనబడును 8. జలతర్పణంచేసిన, తర్పయామి నమః అని మంత్రము చివర చేర్చి తర్పణము చేసిన తర్పణమగును. 9. ఓం హ్రీం శ్రీం చేర్చి జపించిన దీపనమగును. 10. జప్యమానస్య మంత్రస్య గోపనం త్వప్రకాకాశనాత్-జపించు మంత్రమును బహిర్గతము చేయ కుండుటయే గుప్తి అనబడును.

# హూమద్రవ్య పరిమాణం

ఒక కర్షమెత్తు నెయ్యి, ఆలిచిప్పడు పాలు, పంచగవ్యములు సమానభాగములు, తేనె-పాలు యవప్రమాణముగాను, పెరుగు ప్రసృతి (   ) పేలాలు పిడికెడు, పిండి పిడికెడు, బెల్లం, పంచదార, అర్ధఫలం, కణుపువరకు చెరకు గడ, పత్ర-పుష్పములు ఒక్కొక్కటి చొప్పున - అరటి పండు, నారింజ ఒక్కొక్కటి చొప్పున మాతులింగం 4 భాగములు చేసి ఒక్కొక్క భాగము





చొప్పున హోమం చేయాలి. పనసపండు హోమం చేయునపుడు పదిభాగములు చేసి ఒకటి చొప్పున హోమం చేయాలి.

**అష్టధా నారికేలాని ఖండితాని విదుర్బుధః**
**త్రిధాకృతం ఫలంబిల్వం కపిత్థం ఖండితం ద్విధా ॥**

కొబ్బరి 8 ముక్కలు చేసి ఒక్కొక్కముక్క హోమం చేయాలి. మారేడుఫలం, 3 ముక్కలు, వెలగ 2 ముక్కలు దోసకాయ 2 ముక్కలు చేయాలి. మిగిలిన ఫలములు ముక్కలుగా చేసి హోమం చేయాలి. సమిధలు 10 అంగుళములుండాలి, దూర్వా, ఇప్పతీగ, 4 అంగుళము లుండాలి. ధాన్యములు పిడికెడు, నువ్వులు ఆవాలు చుళుకమాత్రం- లవణంఆలిచిప్పడు, మిరియాలు 20గింజలు (మరీచాన్యపి వింశతిః) హోమద్రవ్యం చెప్పనిచోట తిలాజ్యం హవిస్సుగా గ్రహించాలి.

**విభూషణీ-కుండలధారిణి, సింధూరహారిణీ, సింహిని-భూతిని-నటి-చేటి, కామేశ్వరి, రతిప్రియ సాధనలు చెప్పబడ్డాయి.**

**పేత్కారిణీ తంత్ర మిదంమయోక్తం**
**కృతా సమస్తాగమ సారభూతా ।**
**శత్రో ర్వినాశాయ ధనాయ సమ్యక్**
**సిద్ధ్యైః సదేయం నియతం నియోజ్యా ॥**

**శివార్పణమస్తు**

# వంధ్యా తంత్రం



శ్రీం
సద్యోజాతాయ నమః

## వంధ్యా తంత్రం

**శ్లో॥ ఏనాంసిరోగా వపుష స్తమాంసి యద్దర్శనా ద్దూరత**
**ఏవయాంతి ॥ వందేతమేకంజగతామధీశం**
**తేజోమయం సూర్యమదూర విశ్వమ్ ॥**

**తా:** సమస్తరోగములు-చీకటులు, పాపములు, ఎవరి దర్శనమాత్రము చేతనే దూరముగా పారిపోవునో, అట్టి తేజోమయుడైన, జగత్ ప్రభువైన సూర్యభగవానునకు నమస్కరించుచున్నాను.

## 8 రకముల వంధ్యా స్త్రీలు

**శ్లో॥ జన్మవంధ్యా కాకవంధ్యా మృతవత్సా తథైవచ**
**స్రవద్గర్భా కన్యాపత్యం ప్రసూయతే ॥**
**మూఢ గర్భారజోహీనా హ్యష్టావంధ్యాః ప్రకీర్తితా ॥**

**తా :** 1. సంతానమే కలగనిస్త్రీ గర్భవంధ్యా అనబడును. 2. ఒకే కుమారుడు జన్మించిన స్త్రీ కాక వంధ్య 3. సంతానముపుట్టి మరణించిన స్త్రీమృతవత్స 4-2-1- నెలల్లో రజదోషముచే గర్భస్రావమగుట స్రవద్గర్భ. 5,4వ నెలలో పిండముపడిపోవుట గలద్గర్భ 6. కేవలం స్త్రీ సంతానమే కలిగిన కన్యాపత్యం, 7. గర్భము వచ్చి ఎదగకపోవుట, తిరిగి గర్భము రాకుండుట మూఢగర్భ. 8. రజోదర్శనము కాకపోవుట రజోహీన అని, వంధ్యాస్త్రీలు 8 విధములుగా ఉందురు.

**శ్లో॥ అంగకంపో గతేర్భంగో రజః ప్రాప్తౌచ**
**యోషితాం॥ సక్షౌద్ర సర్పిః సంకాశమంగస్పందశ్చ**
**దోషకృత్ ॥ అంగమర్ధో యోనిశూలః కామాస క్తేః**
**భవేస్త్రియః ॥ రజః ప్రాప్తౌచ నారీణాం చింతా వైకల్యరోదనం ॥**

**తా :** ఋతుదోషముకల స్త్రీలకు, రజస్సు అయినపుడు శరీరము కంపించుట-నడక సరిగా లేకపోవుట-రజస్సు నెయ్యివలె ఉండుట జరుగును. మైధున సమయమునందు యోని నొప్పిగా నుండుట-బహిష్టు సమయములో మనస్సు వ్యాకులముగా నుండుట సంభవించును.

**శ్లో॥ జపాకుసుమ సంకాశం పక్వబింబ ఫలప్రభం**
**ఏవం రజఃస్రుతౌనారీ గర్భవత్య చిరాద్భవేత్ ।**

**తా :** జపాకుసుమంవలె, పండిన దొండపండువలె రజస్సు అయిన స్త్రీ త్వరలోనే గర్భవతి అగునని తెలియవలెను.

**శ్లో॥ జంబూపక్వ ఫలాకారం తథానీలీ నిభంక్వచిత్**
**కర్బురం గంధసంయుక్తం మేధోవాతైశ్చ పీడితం ॥**
**రక్తగ్రంధి యుతంకోష్ఠం మర్యాదోల్లంఘితం రజః**
**పద్మమాకుం చితచైవ మర్మణావేష్టితం క్వచిత్ ॥**
**కీటవిద్ధంతు సచ్ఛిద్రం నాభేఃశూలం ప్రదృశ్యతే**
**వమనోద్గార హృత్కంపాః స్వేదోదాహాశ్చ జాయతే ॥**
**ప్రతాపః పీతతా వక్త్రేనేత్రే దాహ స్తథేవచ**
**కంఠోష్ఠతాలుశోషశ్చ నేత్రస్రావో మదోన్మదః**
**ఏవం విలోకితే చిహ్నే చిరంగర్భం బిభర్తిసా**
**విపరేతేషు చిహ్నేషు వంధ్యాప్రోక్తా విచక్షణైః ॥**

**తా:** స్త్రీయొక్క రజస్సు పండిన నేరేడుపండు రంగులో నీలంగానున్నచో, వాసనయుక్తముగా మేధోథాతువు, వాతదోషము అని తెలియవలెను. గర్భకోశమందు రక్తకణితియున్న, గర్భముదాల్చిన నెలలో రజస్సు అయిన యోని ముడుచుకొన్నను, బొడ్డువద్ద నొప్పి, వాంతులు, గుండె దడ, చమటలు దాహము కళ్ళవెంట నీళ్ళుకారుట, ముఖము కొద్దిగా పాలిపోయిన దవడలు-కంఠము-పెదవులు పలుచబడిన చాలాకాలము పిమ్మట గర్భము ధరించును. వీటికి వ్యతిరేక లక్షణములుండుట వంధ్యా లక్షణము.





**శ్లో॥ రక్తేన పీతావాతాభ్యాం శ్లేష్మణా సన్ని పాతతః**
**గ్రహదోష వికారైశ్చ దేవతానాం చకోపనే**
**అభిచార కృతైర్గర్భః పురుషైశ్చాల్ప రేతసైః ॥**

**తా :** రక్తదోషముచేత, వాత-పైత్య-శ్లేష్మదోషములచేత సన్నిపాతము (టైఫాయిడ్) వలన, గ్రహదోషము వలన, దేవతల కోపముచేత, ఇతరుల ప్రయోగమువలన గర్భములు నిలువవు అదేవిధముగా పురుషులు అల్పవీర్యము గలవారైన గర్భము నిలువదు.

**శ్లో॥ వృద్ధో మధ్యోమృదుశ్చైవ త్రివిధః పురుషః స్మృతః**
**కిశోరో ద్వాదశాబ్దస్తు షోడశాంతః ప్రకీర్తితః ॥**
**తదూర్ధ్వం త్రింశతం యావత్ యువా సప్రోచ్యతే బుధైః**
**పంచాశదబ్దః స్థవిరః తదూర్ధ్వం వృద్ధ ఉచ్యతే ॥**

**తా :** పురుషులు 3 విధములు-వృద్ధులు-మధ్యములు-మృదువులు, 12 సం॥ 16 వరకు కిశోరులు, 16నుండి 30 వరకు స్థవిరులు-50 దాటితే వృద్ధులు అనబడుదురు.

## పురుషులలో 9 దోషములు

**శ్లో॥ క్లీబం లఘుద్రవం హీనం షండం మేహైశ్చ దూషితం**
**రక్తోద్రోకీరుగా ర్ధశ్చ విషసేవీ తద్దైవచ ॥**
**సురాపేయీచ దోషాశ్చనవైతే పురుషేస్మృతాః ॥**

**తా :** 1-నపుంసకత్వం 2. తక్కువద్రవము- 3.మేహదూషితం- రక్తోద్రేకం-రోగముతో యుండుట-విషము సేవించుట- మద్యము తాగుట- ఆడతనం ప్రవర్తన-అంగదోషములు అను 9దోషములు పురుషులకు ఉండును.

**శ్లో॥ సంప్రాప్తే సంగమేయస్య లింగదాహః ప్రజాయతే**
**రజోగ్రే జ్వలనం బీజంబీజ ఘాతంతుతం వదేత్ ॥**

**తా :** స్త్రీసంగమమునందు లింగము మంటగాయున్న వృషణములు మంటగాయున్న బీజఘాత దోషమనబడును.

# శుద్ధవీర్య లక్షణం

**శ్లో॥ మత్స్యగంధ ప్రతీకాశం బీజంతాళక సన్నిభం**
**మేచకం మధుసంకాశం ధూమాభంఫేన బుద్బుదం ।**
**క్షిప్తేంభసి నిమజ్జేత గుణాధిక్యం ప్రకీర్తితం**
**ప్లవతేయస్య బీజంతు తద్బీజం తన్నపత్యకం**
**తదనుత్పత్తికం బీజం భోజదేవేన భాషితం ॥**

**తా :** చేప వాసన వేయుచు, తాళకం రంగులోనుండి నురగవలె నుండి, నీటిలో వేసిన వెంటనే మునిగిపోవునది మంచి వీర్యంయొక్క లక్షణం, నీటిపై తేలునది సంతానము కలిగించలేదు.

**శ్లో॥ తస్యమూత్రేణ ముద్గాస్తు వాపనీయా విచక్షణైః**
**అంకురః సదృశోముద్గైః కదాచిదపి దృశ్యతే ॥**
**భోగయోగ్యం తదాజ్ఞేయం శుభదంత ద్వయోర్భవేత్**
**తదా సంతాన సంతాన సంప్రాప్తిః చిరంవాహ్యా చిరేణవా ॥**
**యేషాం మూత్రేణ ముద్గాశ్చ ప్రస్ఫుటాః నచసాంకురాః**
**వంధ్యా త్వంతత్ర విజ్ఞేయం స్త్రీణాంవా పురుషస్యవా ॥**

**తా :** స్త్రీ-పురుషుల మూత్రములో పెసర గింజలు నాన్చి పాతినచో మొలకలు వచ్చిన ఎడల ఆ దంపతులు సంతానప్రాప్తి పొందగలరు. లేనిచో వంధ్యాదోషమున్నట్లు తెలుసుకొనవలయును.

**శ్లో॥ రజోహీనాంచ యోనారీం కుమారీం యదిగచ్ఛతి**
**సందోషం ప్రాప్నుయాన్మూఢః అప్యచిరేణనసంశయః**
**అష్టాబ్దై కాదశం యావత్ కుమారీ తినిగద్య తే**
**తయాసంగే కృతేదోషః మహాన్స్యాదు భయోరపి ॥**





**తా :** రజస్వలకాని స్త్రీతో సంగమించిన ఇరువురుకూ దోషము సంభవించును. 8 నుండి 11 సం॥వరకూ కుమారీ అనబడును.

**శ్లో॥ దాహ కంపభ్రమోల్లాస శ్లేష్మాధిక్యం శిరోవ్యధా**
**నాభిశూల మురఃశూల మంత్రకూజన క్లేదనం ।**
**భేదః స్పందశ్చ గాత్రాణాం మోహః కండూశ్చ దేహినాం**
**కరాంఘ్రి కర్ణకండూశ్చ గాత్రగంధిశ్చ దాహవాన్**
**దంతాదీనాం మలాఢ్యత్వం మందాగ్నిత్వం ప్రచీయతే**
**రేతో దోషయుతాః పుంసో రజోదోషయుతాఃస్త్రియః ॥**

**తా :** స్త్రీపురుషులలో, వారిరజస్సులో, రేతస్సులో దోషమున్న ఎడల ఈ క్రింది లక్షణములుండును. అతిదాహము శరీరము అదురుట-శ్లేష్మము-తలపోటు బొడ్డువద్ద నెప్పి-ఛాతినెప్పి- పేగులు అరచుట-మోహము-దురద -చేతులు చెవులు దురద, పండ్లయందు ఎక్కువపాచికట్టుట-జీర్ణశక్తి తక్కువగా నుండుట ప్రకటితమగును.

**శ్లో॥ శుద్ధార్తవాం దోషవిముక్త శుక్రః**
**సుగంధలేపైః పరిలిప్త గాత్రం ॥**
**ప్రశస్త నక్షత్రదినే ప్రహృష్టాం**
**నారీముపే యాద్దయితః సుతార్ధీ**
**దినేషు యుగ్మేషు పుమాన్ ప్రదిష్టః**
**ప్రోక్తాన్యథాస్త్రీ తదనల్ప బుద్ధిః**
**విచార్య సర్వం సుఖితః ప్రసుప్తః**
**ప్రవృద్ధ శుక్రోదయితా ముపేయాత్ ॥**

**తా :** నిర్దోషమైన వీర్యముగల ఆరోగ్యవంతులైన పురుషులు సుగంధ ద్రవ్యములు పయోగించి, శుభ నక్షత్రము రోజున ఋతుస్నానము అయిన స్త్రీని, పుత్రకామనతో దరి చేరవలెను.

శ్లో॥ ఆహారాచార చేష్టాభిః యాదృశీభిః సమన్వితౌ
స్త్రీపుంసౌ సముపేయాతాం తయోఃపుత్రో పితాదృశః
రేతో ధిక్యే భవేత్పుత్రో రజోధి క్యేతు కన్యకా
నపుంసకః సమత్యేతు యధేచ్ఛా పరమేశ్వరి ॥
రక్తేశుక్రమకాలేచ పతితం నిష్ఫలం భవేత్
శుక్రక్షయే నరేషండే నారీగర్భంధధాతిన ॥

**తా :** ఆహారము-ఆచారము-చేష్టలు ఏవిధముగా నుండునో సంతానముకూడా అట్టి లక్షణములు కలవారే పుట్టెదరు. స్త్రీ రజస్వల అయిన రోజునుండి, పదిదినములలో అనగా 4,6,8,10,12,16 రాత్రులందు పురుష సంపర్కము పొందిన కుమారుడు కలుగును. విషమదినములయిన 5,7,9,11,13,15 రాత్రులందు సంగమించిన కుమార్తె కలుగును. 15రో॥ దాటిన అనంతర సంగమం గర్భధారణము కలిగించదు.

శ్లో॥ పూర్వజన్మార్జితం పాపంపీడయేత్ జన్మజన్మని
తదహం సంప్రవక్ష్యామి స్వల్పమార్గేణ సూచితం ॥
బ్రహ్మ ఘ్నో బాలఘాతీచ గోఘ్ను శ్చాన్యోపి ఘాతకః
ఆరామతోయ ఘాతీచ గోఘ్ను శ్చాన్యోపి ఘాతకః
పక్షిఘాతాశ్చయే ప్రోక్తాయేచ విశ్వాసఘతకాః
తేచ జన్మాంతరం ప్రాప్య హ్యనపత్యా భవంతివైః
మణిముక్తా ప్రవాళాది వజ్రవైఢూర్య హారకః
గోమేద రత్న హారీచ మృతాపత్యః ప్రజాయతే ॥

**తా :** పూర్వజన్మమునందు చేసిన పాపము ఈ జన్మమునందు అనుభవించవలసి యుండును. బ్రాహ్మణులను-బాలురను చంపిన వారు-ఆవును చంపినవారు-మందిరములు కాలువలు-నూతులు కప్పెట్టినవారు-పక్షులను చంపినవారు-విశ్వాసఘాతకులు పరదారారతులు ఈజన్మమునందు సంతానము లేనివారగుదురు. మణులు-రత్నములు దొంగిలించిన వారికి మృతసంతానము కలుగును.





శ్లో॥ కూష్మాండ ఫలహారీచ తధాన్యాని ఫలానిచ
తధాజన్మాంతరం ప్రాప్యగలద్గర్భా భవంతివై ॥
అభక్ష్య భక్షణాచ్చైవ సురాపీ గురుతల్పగః
దేవద్రవ్యా పహారీచ కన్యాపత్యం ప్రజాయతే ॥

గోత్ర జాయాభిగమనే శ్వస్రూ స్వస్రుస్నుషారతిః
తేన పాపేన దేదిహస్య అపుత్రత్వం ప్రజాయతే ॥

**తా :** గుమ్మడి-మామిడి-ధాన్యములు దొంగిలించిన వారికి గర్భస్రావము కలుగును. తినకూడనివి తిన్నవారికి, మద్యపానము చేసి వెళ్ళకూడని స్త్రీలతో సంగమంచేసిన వారికి, దేవతలసొమ్ము దొంగిలించిన వారికి స్త్రీ సంతానము కలుగును. అత్త-సోదరి-కోడలు-స్వగోత్రస్త్రీ వీరితో సంగమించిన వారికి సంతానము కలుగదు.

శ్లో॥ తస్యపాప విశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తంతు కధ్యతే
గావః స్త్రీ బాలకశ్చైన యేచాన్యే కష్టసంస్థితాః ।
విపత్తిభ్యశ్చ తన్మోక్షః కర్తవ్యశ్చ సుధీమతా
జంతవో వివిధా కారాః యేచనిర్భంధ సంస్థితాః
తేసర్వే మోక్షణీయాశ్చ సతతంద్రవ్య శక్తితః
ఏవంకృతేతు సర్వేషాం పశ్చాత్ కృచ్ఛ్రం సమాచరేత్ ॥

**తా :** వీరు పాపపరిహారార్థం ప్రాయశ్చితం చేసుకోవాలి. గోవులను-బాలురను-కష్టములో ఉన్నవారిని ఆదుకొని పోషించాలి. ఏ జంతువులను బంధించి పెంచరాదు.

శ్లో॥ దయాదానం తపోహోమో దేవతానాంచ పూజనం
ఆదౌచై వోపచారంచ పశ్చాద్భోజన యోజనం
ఋతుః సూక్ష్మతరశ్చైవ కుంకుమోదక సన్నిభః
కటిశూలం భవేత్తస్యాయోని శూలం నమజ్వరః
మారుతస్య వికారోయం తస్యాః కర్మసమాచరేత్ ॥

**తా :** దయా-దానం-తపస్సు-హోమము-దేవతల పూజ చేయాలి. పెద్దలను సేవించాలి. సంతర్పణ అన్నశాంతి చేయాలి. కొద్దిగా రజోదర్శనమై కుంకుమనీళ్ళవంటి రంగు కలిగిన రజస్సు అయినచో, నడుమునొప్పి జ్వరముఉన్న, ఆ స్త్రీకి వాతము వలన ఋతుదోషమున్నట్లు తెలియవలెను.

శ్లో॥ **మూలంతు సహకారస్య తధావ్యాఘ్ర పదస్యచ**
**త్రివృతా సంభవం మూలం క్షీ రేణాలోద్యతంపిబేత్ ।**
**సప్తాహం పంచరాత్రంవా యావత్స్ర వతిశోణితం**
**తతోయోన్యా విశుద్ధాయామిదందద్యాన్మ హౌషధం**
**లక్షణా క్షీర సంయుక్తం నస్యేపానే ప్రయాజయేత్ ॥**
**తేనసా లభతే పుత్రం ఘ్రాణేవా దక్షిణే తతః**
**వామనాద్యాం భవేత్కన్యా రూపేణా తీవశోభనా ॥**

**తా :** మామిడివేరు-వ్యాఘ్రపదం-త్రివృతమూలం పాలతోనూరి 7 రోజులుగాని, 5 రాత్రులుగాని, 3 రోజులుగాని రజోదర్శనమాగు వరకు సేవించాలి. అనంతరం యోని శుద్ధి అయిన పిమ్మట లక్షణవేరు పాలలో నూరి త్రాగాలి. ఈఓషధిరసం కుడిముక్కు రంధ్రంలో వేసిన పుత్రుడు కలుగును. ఎడమముక్కు రంధ్రంలో వేసిన పుత్రిక కలుగును.

శ్లో॥ **యస్యాపి నిహితం పుష్పం వ్రణైఃసమభి లక్షయేత్**
**పక్వ జంబూఫలాకార ముష్ణంస్రవలి శోణితం ।**
**కటిశూలం భవేత్తస్యాః ఉదరంచ ప్రదహ్యతే**
**పుష్పస్రావం కరోత్యుష్ణమే తత్పిత్తస్య లక్షణం ।**
**ఉత్పలం తగరం కుష్టంయష్టి మధుక చందనం**
**ఏతాని సమభాగాని అజాక్షి రేణ పాయతేత్ ॥**
**త్రిరాత్రం పంచరాత్రం వాయావద్వహతి శోణితం**
**తతోయోన్యాం విశుద్ధాయాం తతోదద్యా న్మహౌషధం ॥**





**లక్ష్మణా క్షీరసంయుక్తా నస్యేపానే ప్రశస్యతే**
**తేనసా లభతే పుత్రం రూపవంతం మహాద్భుతం ॥**

**తా :** స్త్రీకి బహిష్టు సమయములో పండిన నేరేడుపండు రంగు వంటి రజస్సు కలిగి, వేడిగానుండునో, నడుమునొప్పి కడుపుమంట, ఉన్నచో పైత్య దోషమని తెలియవలెను. ఉత్పలం-తగరం-చెంగల్వ కోష్ఠు-యష్టిమధుకం-చందనం ఇవి సమభాగములుగా గ్రహించి, మేకపాలతో సేవించాలి. బహిష్టు సమయములలో 3 లేదా 5 రోజులు సేవించిన పైత్యదోషము తొలగిపోవును. అనంతరం మహౌషధం అయిన లక్ష్మణవేరు పాలతోనూరి కుడిముక్కులోగాని, లోనికిగాని సేవించిన పుత్రసంతానము కలుగును.

శ్లో॥ **కఫేన నిహితం పుష్పం ప్రణాశమభి లక్షయేత్**
**బహులం పిచ్ఛిలంచైవ నాతిరక్తం భవేద్రజః ॥**
**నాభిమండలమూలేన శూలంభవతి దారుణం**
**త్రికటు త్రిఫలావహ్నిః సమభాగం ప్రకల్పయేత్ ॥**
**హింగుర్థే యోర్థభాగేన అజాక్షీరేణ తత్పచేత్**
**త్రిరాత్రం పంచరాత్రంవా యావద్వహతి శోణితం ।**
**తతోయోన్యాం విశుద్ధాయాం ఇదందద్యాన్మహౌషధం**
**లక్ష్మణాం క్షీరసంయుక్తాం నస్యేపానేచ యోజయేత్ ॥**

**తా :** స్త్రీకి రజస్సులో కఫదోషమున్న ఎడల స్రావము ఎక్కువగుట, ఎక్కువ ఎర్రదనము లేకుండుట-బొడ్డువద్ద నొప్పి ఉండుట జరుగును. దీనికి చికిత్స-త్రికటు (సొంఠి-మిరియాలు-పిప్పళ్ళు)-త్రిఫల (కరక-తాడి-ఉసిరి)-చిత్రమూలం ఇవి సమానభాగములుగా గ్రహించి వీటిలో 8వవంతు ఇంగువకలిపి-మేకపాలతో సేవించవలెను. బహిష్టు సమయములో స్రావమగునపుడు 3 లేదా 5-7 రోజులు తీసుకొనవలెను.

అనంతరం సంతానప్రాప్తికి లక్ష్మణవేరు పాలతో సేవించిన గర్భము ధరించును.

**శ్లో॥ సన్నిపాత హతేపుష్పే జ్వరస్త్రీవః ప్రజాయతే**
**శోణితంచ భవేత్సూక్ష్మ మత్యుష్ణం పిచ్ఛిలంబహు ॥**
**కుక్షికోదర యోన్యాంచ కట్యాం శూలంచ జాయతే**
**గంధర్వ హస్తమూలంచ సహకారంచ వేశ్మని**
**అజాక్షీరేణ పిష్టాణి సప్తాహం దాపయేచ్ఛతత్ ॥**

**తా :** సన్నిపాత దోషము చేతకూడా రజస్సుదోష యుక్తమగును. ఇందు తీవ్రజ్వరము-వేడిగా-తక్కువగా బహిష్టు వెడలుట, చిక్కగా నుండుట-కడుపు-నడుమునొప్పి యుండుట, అతినిద్ర కలుగును దీనికి చికిత్స-చిట్టాముదపు చెట్టువేరు, మామిడివేరు-తెల్లతెగడవేరు నీలోత్పలం-తగరం చెంగల్వకోష్టు-యష్టిమధుకం-తెల్లచందనం-సమాన భాగములు గ్రహించి, మేకపాలలో నూరి 7 రోజులు సేవించిన దోషము తొలగును. అనంతరం సంతానప్రాప్తికి లక్ష్మణవేరు సేవించవలెను.

# వంధ్యా స్త్రీలలో మరో 8 విధములు

**శ్లో॥ అన్యద్వంధ్యాష్టకం వక్ష్యే సర్వతంత్రేషు గోపితం**
**త్రిపక్ష శుభ్రతీ సజ్జా త్రిముఖీ వ్యాఘ్రిణీ బకీ ॥**
**కమలీ వ్యక్తినీచైవ తాసాం చిహ్నం వదామ్యహం**

**తా:** ఇతరములగు 8 రకముల వంధ్యాస్త్రీలను గూర్చి చెప్పెదను. 1.త్రిపక్షీవంధ్య 2.శుభ్రతీ 3.సజ్జా 4.త్రిముఖీ 5.వ్యాఘ్రిణి 6.బకీ 7.కమలిని 8.వ్యక్తిని, వీరి లక్షణములు ఇట్లుండును.

**శ్లో॥ త్రిపక్షినామ యావంధ్యా త్రిపక్షే పుష్పితా భవేత్**
**ద్వేజీరకే శ్వేతవచా కర్కోట్యాశ్చ ఫలం సమం ॥**





**తండులోదక సంపిష్ట చోత్థితా సూర్యసమ్ముఖీ**
**త్రిదినంచ పిబేన్నారీ దుగ్ధభక్తంచ భోజనం ॥**
**తేనగర్భో భవేన్నా ర్యాః సత్యమేతన్న సంశయః ॥**

**తా :** త్రిపక్షి అను వంధ్య 45 రో॥ ఒకసారి బహిష్టు అగును. ఇట్టి స్త్రీలు 2 రకముల జీలకర్ర-తెల్లవచ-కాకరకాయ సమంగా గ్రహించి, బియ్యం కడుగులోనూరి, ప్రాతఃకాలమందు తాగాలి. ఇలా 3రోజులు చేయుచూ పాలు అన్నం మాత్రమే తినాలి. అపుడు గర్భమందున్న దోషము తొలగి సంతానవతి అగును.

**శ్లో॥ శుభ్రతీనామ యావంధ్యా చిహ్నంతస్యా వదామ్యహం**
**గాత్రం సంకుచతే నిత్యం దేహేచైవ వివర్ణతా**
**అప్రమాణైశ్చ దివసైః తస్యాః పుష్పం ప్రజాయతే ॥**

**తా :** శరీరము ముడుచుకొనునది, శరీరము పాలిపోయి ఉండునది, శుభ్రతి అనబడును. వీరికి చికిత్సలేదు. బహిష్టు సక్రమదినములలో నియమానుసారం కానిది సజ్జావంధ్య. వీరికి త్రిపక్షికి చెప్పిన చికిత్సయే చేయవలయును.

**శ్లో॥ త్రిముఖీంచ ప్రవక్ష్యామి మైధునే సలిలం స్రవేత్**
**భోజనే మైధునే లౌల్యం గర్భః తస్యా నవిద్యతేః**
**వ్యాఘ్రిణ్యా ఉత్తరేకాలే పత్యమేకం ప్రజాయతే**
**త్రిపక్ష్యుక్తం ప్రదాతవ్యం ఔషధం పుత్రదాయకం ।**
**బక్యసృక్ స్రవతే శ్వేతం దశమేష్టమకే దినే**
**అసాధ్యాసా సుసాధ్యావా ఔషధం నైవకారయేత్ ॥**
**సలిలం స్రవతేయోన్యాః కమలిన్యాః నిరంతరం**
**ఆసాధ్యాసాచ విజ్ఞేయా ఔషధం నై వ కారయేత్ ।**

**వ్యక్తినీనామ వంధ్యాయాః ప్రమేహీ భవతిస్ఫుటం**
**రక్తాపా మార్గజం బీజం శర్క రామర్దకీఫలం ॥**
**ఔషధిం రత్నమాలాంచ గోదుగ్ధేన ప్రవేషయేత్**
**త్రింసప్త దివసఃపీత్వా ప్రమేహం నాశయేద్ధ్రువం ॥**

**తా:** మైధున సమయమందు నీరుస్రవించునది. భోజనము కొరకు, మైధునముకొరకు అత్రుతపడునది త్రిముఖీ అనబడును. వీరికి చికిత్సలేదు, అనేక ప్రయత్నముల పిమ్మట చాలాకాలమునకు ఒకసంతానము పొందునది వ్యాఘ్రిణీ, వీరికి కూడా పూర్వము త్రిపక్షికి చెప్పిన చికిత్సయే చేయవలెను తెల్లబట్ట 8-10రోజులలో అగునది. బక వంధ్య అందురు. ఇది సాధ్యమైనా అసాధ్యమైనా చికిత్స చేయరాదు. నీరు కారునది కమలినీయవంధ్య వీరికి చికిత్సలేదు. ప్రమేహ దోషము వలన సంతానము పొందలేనిది వ్యక్తినీ వంధ్య వీరికి చికిత్స ఉన్నది. ఎర్రుత్తరేణీ విత్తనములు-పంచదార-పెద్దదూలగొండి అమర్దకీ, రత్నమాల (      ) వీటిని ఆవుపాలతో నూరాలి. 3-7 రోజులు దీనిని తాగిన ప్రమేహము శాంతించును.

**శ్లో॥ కృష్ణాగురు కేసరంచ కర్కోటీం సఫలాం తథా**
**ద్వేజీరకే సపత్నాగోః క్షీ రేణాలోడ్య సాపిబేత్ ॥**
**దినత్రయం దుగ్ధషష్టి భోజనం గర్భధారకం ॥**

**తా :** నల్ల అగరు-నాగకేశరములు-కర్కోటి-నల్ల జీలకర్ర తెల్లజీలకర్ర ఇవి సమాన భాగములుగా గ్రహించి, దూడకలిగిన ఆవుపాలతో నూరి 3 రోజులు తాగాలి. పాలు అన్నం మాత్రమే తినాలి. అపుడు దోషము తొలగి గర్భధారణ అగును.

## మృతవత్సా చికిత్స

**శ్లో॥ ప్రాంగ్ముఖ॥ కృత్తికాఋక్షే వంధ్యాకర్కోటకీం హరేత్**
**తత్కంధం పేషయేత్తోయైః కర్షమాత్రం సదాపిబేత్**
**ఋతుకాలేతు సప్తాహం దీర్ఘజీవి సుతో భవేత్ ॥**





**తా:** కృత్తికా నక్షత్రమురోజున కాకరవేరు గ్రహించి నీటితో నూరి కర్షమెత్తున రోజూ సేవించాలి. ఋతుకాలము నందు 7రోజులు సేవించిన దీర్ఘాయువు కల సంతానము కలుగును.

## ఫలఘృతం

**శ్లో॥ మంజిష్ఠా మధుకం కుష్టం త్రిఫలా శర్కరాబలా**
**మేదా పయస్యా కాకోలీ మూలంచై వాశ్వ గంధజం ।**
**అజమోదా హరిద్రే ద్వేహింగుకం కటురోహిణి**
**ఉత్పలం కుముదంద్రాక్షా కాకోల్యౌ చందనద్వయం**
**ఏతేషాం కర్షకైర్భాగైః ఘృతప్రస్థం విపాచయేత్**
**శతావరీరసంక్షీరం ఘృతాద్ధేయం చతుర్గుణం ॥**
**సర్పి రేతన్నరః పీత్వానిత్యం స్త్రీషు వృషాయతే ॥**

**తా :** 1. మంజిష్ఠ 2. మధుకం (అతిమధురం) 3. కుష్ఠం (చెంగల్వకోష్టు) 4. త్రిఫలా 5. పంచదార 6. ముత్తువపులగం 7. మేధ (Grgymnema aurantiacum) 8.కాకోలీపయస్యా (జుట్టుగతీగ) (Odina Wedier) 9. కాకోలీ (దుంప) పిల్లి తెగలవలె ఉంటాయి. 10. అశ్వగంధ 11. అజమోద (Carum Roxburghianum) 12. పసుపు 13. ఇంగువ 14. కటుకరోహిణీ 15. ఉత్పలం 16. కలువ 17. ద్రాక్ష 18. రెండురకముల చందనం ఇవన్నియు ఒక్కొక్క తులము చొప్పున వీటి చూర్ణమును సమభాగములుగా గ్రహించి ఆవునెయ్యి 1ప్రస్థం, (64 తులములు) పిల్లపీచరరసం 1ప్రస్థం, పాలు 4 ప్రస్థములు అన్నీ కలిపి నెయ్యి సిద్ధము చేసుకోవాలి. దీనిని సేవించినవారు స్త్రీలను రమించుటలో వృషభములగుదురు ఇందు ముత్తువ పులగంనుబలా అందురు. ఇది 1 బల 2 అతిబల 3 మహాబల 4 నాగబల అని 4 రకములుగా లభించును.

శ్లో॥ పుత్రాన్ జనయతేనారీ మేధావీ ప్రియదర్శనాన్
యాచైవాస్థిర గర్భాస్యాద్యానారీ జనయేన్మృతం
అల్పాయుషంవా జనయేద్యాచ కన్యాం ప్రసూయతే
యోనిదోషే రజోదోషే గర్భస్రావేచ శస్యతే ॥
ప్రజావర్ధన మాయుష్యం సర్వగ్రహ నివారణం
నామ్నా ఫలఘృతం హ్యేతత్ రహస్యం పరికీర్తితం ॥

**తా :** దీనినే "ఫలఘృతం" అంటారు. దీనిని స్త్రీలు సేవించిన, మేధావులు అందమైనవారు అయిన సంతానము కలుగుదురు. యోనిదోషము-రజదోషము-గర్భస్రావములు పొందువారు ఆడపిల్ల మాత్రమే పొందినవారు ఆ దోషములు పోయి ఆయుర్భాగ్యము కలిగినవారిని పొందెదరు. గ్రహపీడలు నివారింపబడి సంతానము పొందెదరు. ఇది బహురహస్యమైనది.

శ్లో॥ పత్రమేకం పలాశస్య గర్భిణీ పయసాన్వితం
పీత్వా చ లభతే పుత్రం రూపవంతం న సంశయః ।
మూలం శిఖాయాః ఖలు లక్ష్మణాయాః
క్షీరాన్న చర్యా నియమేన భుంక్తే
పుత్రం ప్రసూతే వనితాచ చిత్రం ॥

**తా :** మోదుగు ఆకుఒకటి పాలతో గర్భిణిస్త్రీ సేవించిన పుత్రసంతానము కలుగును. మయూర శిఖవేరు-లక్ష్మణ వేరు బహిష్టు సమయములో పాలతో 3 రోజులు సేవించిన పుత్రసంతానము కలుగును. పాలు అన్నం మాత్రమే తినాలి.

శ్లో॥ సపిప్పలీ కేశర శృంగబేరం
భద్రోషణం గవ్యఘృతేన పీతం ॥
వంధ్యాపి పుత్ర లభతే హఠేన
యోగస్తు సేయం మునిభిః ప్రదిష్టః ॥





**తా :** పిప్పళ్ళు-నాగకేశరములు-అల్లం-నాగరముస్తెలు-నల్ల మిరియాలు ఇవి సమానభాగములుగా నూరి ఆవునేతితో సేవించిన, వంధ్యాస్త్రీ పుత్రవంతురాలగును.

శ్లో॥ బీజపూరక బీజాని తధారుద్రోద్భవా జటా
లింగీ మయూర జాఖ్యా చ సమభాగం కురుద్వయం ॥
వ్యతీ తేప్నా పిబేన్నారీ పుత్రోభవతి నిశ్చితం ॥

**తా :** మాదీఫలం విత్తనములు-మర్రిఊడ-శివలింగి (లింగ దొండ) మయూరశిఖి-ఇవి సమాన భాగములు గ్రహించి-బహిష్టు స్నానమయినరోజు సేవించిన పుత్రసంతానము కలుగును.

# వంధ్యాపరీక్ష

శ్లో॥ శరావే నూతనే నారీమూత్రేతు చణకాన్ దదేత్
రాత్రౌతు స్థాపయేదేవ పర్యంకాత్తదధః పునః ।
పరీక్షే దంకురాన్ సర్వాన్ రక్తాన్వాప్యర్ధకృష్ణకాన్
కృష్ణే భవతి వంధ్యాత్వం రక్తాభవతి పుత్రిణీ ॥

**తా :** కొత్తమూకుడులో స్త్రీమూత్రముపట్టి అందు శనగలు వేసి, ఒకరాత్రి శయనాగారములో మంచము కింద ఉంచిన మరునాడు దయము చూడాలి. అందు ఎర్రనిమొలకలు వచ్చిన, స్త్రీసంతానవతి అగును. నల్లనిఅంకురములు వచ్చిన వంధ్యాదోషమున్నట్లు తెలియ వలెను.

శ్లో॥ లక్ష్మణా శిఖిమూలం వాదుగ్దేపీత్వా దినత్రయం
ఋతౌజాతే స్త్రియోగర్భం గృహ్ణీయాన్నాత్ర సంశయః ॥

**తా:** లక్ష్మణ-మయూరశిఖివేరు పాలలోనూరి బహిష్టు సమయములో 3 రోజులు త్రాగిన గర్భవతి అగును.

॥శివార్పణమస్తు॥

# వీణా శిఖ తంత్రం



## వీణాశిఖతంత్రం

ఇది శివునివామాచారములో పూజించు తంత్ర విధానం తెలియ జేస్తుంది. శివుని, తుంబురునాధునిగా పేర్కొనబడినది. ఇతనికి 4 ముఖములు, 4 సోదరీలు పరివేష్టించియుంటారు. క్రీ॥శ 802లో రాజ్యము కోల్పోయిన రెండవ జయవర్మ, తన గురువైన "శివకైవల్యు"ని ద్వారా, తుంబురనాధుని పూజించి గురు అనుగ్రహముతో తిరిగి రాజ్యాభిషిక్తు దయ్యాడు. మహేంద్ర పర్వతముపైనున్న ఒక సంస్కృత శిలాశాసనం, అది అతని నివాసస్థానమని, శివుని వామాచారములో అర్చించినట్లుగా తెలియజేస్తున్నది. అనంతరం హిరణ్యదాముడను బ్రాహ్మణుడు శివుని మెప్పించి సిద్ధిపొందినట్లు ఉల్లేఖించబడినది. ఆగ్నేయ ఆసియాఖండములో, కాంభోజ (కాంబోడియా) అంకోర్‌వాట్ ఇండోనేషియా జావాలలో ఈ అర్చన వ్యాప్తిలోనున్నట్లు అచ్చటి శిల్పములు, శాస్త్రములు, ప్రాచీనగ్రంథములు తెలుపుచున్నవి.

**శ్లో॥ శాస్త్రం శిరచ్ఛేద వినాశిఖాఖ్యం సమ్మోహనా మాపి నయో త్తరాఖ్యాం ।**
**తుత్తుంబురోర్వక్త్ర చతుష్కమస్య సిధ్యేవ విప్రాస్సమ దర్శయేత్సః ॥**

**తా :** తుంబురనాధ శివుని 4ముఖముల నుండి 4 తంత్ర శాస్త్రములు ఉద్భవించినవి 1–శిరచ్ఛేద తంత్రం–ఈతంత్ర గ్రంధము ప్రస్తుతం లభించుట లేదు. వామాచార విధానములోని ఈతంత్రమును ఉజ్జయినీరాజు విక్రమాదిత్యుడు ఆచరించి సిద్ధిపొందినట్లు జనశృతి కలదు. 2.వీణాశిఖ తంత్రము, ప్రస్తుతరచన అదే, ఇది వినాశిఖ అనిశ్లోకములో పేర్కొనబడినది వీణను, శిఖనుధరించిన శివునిరూపము గావున ఇది వీణాశిఖ తంత్రమని పేరొందినది. 3. సమ్మోహన తంత్రం– మనదేశములో లభించుటలేదు. 4. నయోత్తర తంత్రం– ఇదికూడా లభించుట లేదు.

అయితే శిరచ్ఛేద–సమ్మోహన తంత్రములు స్వతంత్రముగా గ్రంథములుకావని, కాళికాదేవిని, అర్చించు విధానములో శాక్తేయములో ఒక పూజాపద్ధతిని, జయద్రధయామళములో చెప్పబడినది. ప్రారంభ తాంత్రిక శైవాచారములో తుంబురునాధుని అర్చన భారతదేశములో ప్రారంభమై తూర్పు–ఆగ్నేయ ఆసియాలలో కాంబోడియా జావా–సుమిత్రా దీవులలో

విశేషవ్యాప్తి పొందినది. రెండవ జయవర్మ చక్రవర్తిగా వెలుగొందుటకు ఒక జనపద గ్రామములో హిరణ్యదాముడను బ్రాహ్మణుడు గొప్ప కుండహోమము చేసినట్లు చెప్పబడినది.

చతుర్ముఖుడైన శివుని ఆకారుతో ఒకగొప్ప శివలింగము-చరలింగ రూపము నిర్మించి అర్చించినట్లుగా కాంబోడియో శిలాలేఖలలో నున్నది, తుంబురునాధుని గూర్చి ఇతర గ్రంథములలో కొంత విషయము కనబడు చున్నది.

1. యోగావాశిష్టః-ఇందు నిర్వాణ ప్రకరణములో, అష్టమాతృకల పరివేష్టితుడైన భైరవుడు, తుంబురనాధునిగా ఉల్లేఖించబడ్డాడు.

2. విష్ణుధర్మోత్తర పురాణం-ఇందు దేవీచతుష్టయ సహిత తుంబురు నిర్మాణము అని ఒక అధ్యాయమున్నది. ఇందు తుంబుర శిల్ప నిర్మాణము గూర్చి వ్రాయబడినది లక్షణములిట్లు చెప్పబడినవి తుంబురునకు 4 ముఖములు. వృషభ వాహనం-కపాలధారి-చంద్రకళా మకుటం-జయ-విజయ-జయంతి-అపరాజితల పరివేష్టితుడై యుంటాడు.

3. అగ్ని పురాణం-ఇందుస్వల్ప వివరణ ఇవ్వబడినది. వృషభ వాహనం-త్రిశూలము ధరించి 4 లేదా 7 మాతృగణ పరివేష్టితుడై యుంటాడు.

4. శారదా తిలకం-ఇది మంత్రశాస్త్ర గ్రంథము, తాంత్రిక సిద్ధులకొరకు తుంబుర బీజము "క్ష్మ్ర్యాం" జపము చేయవలెనని చెప్పబడినది. పరివార దేవతల 4 బీజములు ఇట్లు చెప్పబడినది. జయ=విజయ-ఆజిత (జయంతి కాదు) అపరాజిత వారిబీజములు వరుసగా, జ్మ్ర్యా-భ్మ్ర్యాం-స్మ్ర్యాం హ్మ్ర్యాం పాశం- అంకుశం-శూలం-కపాలం-ఖట్వాంగ ధారిగా తుంబురుడు వర్ణించబడ్డాడు. ఈ 4 మాతృకలతో బాటు 4 దూతికలున్నారు. వీరు దుర్భగ-సుభగా-కరాళీ-మోహిని-వీరు ఆగ్నేయ-నైరుతి-వాయవ్య-ఈశాన్య -భాగములందుంటారు. సంతానప్రాప్తికి, అరిష్ట నివృత్తికి, ఇష్టప్రాప్తికి ఈఅర్చన పనిచేస్తుందని చెప్పబడినది. **5-షట్కర్మదీపిక**-దీనిని శ్రీకృష్ణ విద్యావాగీశ భట్టాచార్య రచించారు. ఈయనే 'తంత్రసార' అనే ప్రఖ్యాత





రచనకూడా చేశారు. ఇందు జ్వరశాంతికి చతుర్భుజుడైన తుంబురుని పేర్కొన్నారు ఇతడు జటాధారి, త్రినేత్రుడు-వృషభారూఢుడై-చంద్రకళా వతంసుడై-శూలము ధరించి-అక్షమాల-పుస్తకము-అమృత కలశముతో నున్నట్లు వర్ణించబడినది.

6. నేత్రతంత్రం-ఇది కాశ్మీర శైవతంత్ర గ్రంధము ఇందు తుంబురనాధుడు మహారుద్రునిగా చెప్పబడ్డాడు 5 ముఖములు-10 భుజములు- మాయాదూతికగా పేర్కొనబడినది.

7. గరుడ పురాణము-ఇందు తుంబురుడు విష్ణుదేవతగా జ్వరము-విషహరణము కొరకు ఈ మంత్రము పనిచేయునని చెప్పబడినది.

8. యోగరత్నావళి-ఇది శ్రీకంఠుని రచన, పంచపరమేష్టిలలో తుంబురునాధుడు ఒకడుగా ఇతడు చెప్పాడు. సకలతంత్రములకు పరమేశ్వరుడే అధిదేవతగా పేర్కొనబడింది. విషముహరించుటకు ఈ మంత్రము చాలాగొప్పదని మహిమాన్వితమైనదని ఉల్లేఖించబడింది.

9. తంత్రసార సంగ్రహ-ఇందు తుంబురుడు ఒక ఋషియని, ఈమంత్రమే క్ష్మ్ర్యాం అగునని ఇదివశీకరణాది సిద్ధులనిచ్చునని తెలుపబడింది. ఈ బీజాక్షరము సకలసిద్ధులనిచ్చు చింతామణి మంత్రమని, దీని అధిదేవత మహారుద్రుడని వ్రాయబడినది.

10. మంజుశ్రీ మూలకల్పం-ఇది బౌద్ధతాంత్రిక గ్రంథము. ఇందు తుంబురుడు బోధిసత్వునిగా చెప్పబడ్డాడు. జయ-విజయ-అజిత-అపరాజితలు సోదరులుగా వర్ణించపడ్డారు. వీరు యక్షిణులని చెప్పబడింది. అయితే జైన పండుతుడైన హేమచంద్రాచార్యుడు తన అభిధాన చింతామణి అనే గ్రంథంలో తుంబురుడు యక్షుడని వ్రాశాడు.

శాంతి-పుష్టి కర్మలలో ఈ తుంబురునాధుని అర్చన విశేషముగా సఫలమగును. సాధకరుచి భేదముననుసరించి ఆచారభేదములు ఏర్పడినవి.

ఆశ్వీయుజ మాసశివరాత్రి

2001 మేడవరపు సంపత్ కుమార్

శ్రీం

ఓం నమో మహాభైరవాయ

# వీణాశిఖతంత్రం

**శ్లో॥ కైలాస శిఖరేరమ్యే నానారత్నోప శోభితే**
**నానాద్రుమ లతాకీర్ణే సిద్ధచారణ సేవితే ॥**
**తత్రదేహః సురశ్రేష్ఠః క్రీడతే ఉమయాసహ**
**స్తూయమానో మహాసిద్ధైః మహాకాలాదిభిర్గణైః ॥**

**ఋషిభిశ్చ మహాభాగైః భృగ్వాద్యైః సురసత్తమైః**
**తేషాంమధ్యే సముత్థాయ దేవీవచన మబ్రవీత్ ॥**
**శృతం సమ్మోహనం తంత్రం తథానయో త్తరం మహత్**
**శిరచ్ఛేదంచ దేవేశ త్వత్ప్రసాదాత్ సుదుర్లభం ॥**
**వ్రతసాధ్యాని చైతాని యాగసాధ్యానివైపునః**
**అన్యసారా యతోలోకే ప్రాయో ద్రవిణవర్జితః ॥**
**యేభ్యోపి చోత్తరం యస్మాత్కేవలం జ్ఞానసిద్ధిదం**
**సర్వకామప్రదం దేవా యథావత్ బీజపంచకం ॥**
**ఉత్తరం హృదయంహ్యేషాం భక్త్యాదాతుమర్హసి ॥**

**తా :** హిమాలయ పర్వతములలో కైలాసమునందు సుఖాసీనుడై యున్న పరమేశ్వరుడు సిద్ధచారణులచే సేవింపబడుచూ హైమవతితో పాచికలాడుచున్నాడు. మహాకాలాది సిద్ధులు, భృగ్వాది ఋషులు పరివేష్టితుడై యుండగా, గిరినందిని, సమ్మోహనం-శిరచ్ఛేదాది తంత్రములు బోధించారని ఇపుడు సర్వకామప్రదమగు బీజపంచకమును, ఉత్తర తంత్రమును బోధించమని శివుని అభ్యర్థించినది.





## శ్రీ ఈశ్వర ఉవాచ :-

శుక్రాది యోగులకు కూడా తెలియని తంత్రమొకటి యున్నది దీనిపేరు వీణాశిఖ తంత్రము. ఇది వామమార్గములో శివుని తుంబురనాథునిగా వర్ణించుచూ చెప్పబడినది. వీణను ధరించి, శిఖాయుక్తుడగుటచే ఇది “వీణాశిఖ” తంత్రమని పేరు పొందినది.

ఇది సులభముగా గృహస్తులకు కూడా సిద్ధించు తంత్రము వ్రతహోమాదు లవసరములేకనే సుసిద్ధమగును సూర్య-చంద్రగ్రహణము లందు కాని 4,5,9,11 తిథులందు తుంబురనాథ శివుని అర్చించవలయును. శిష్యులకు దీక్ష ఇచ్చుటకు మాత్రము ముందుగా హోమము చేయవలయును.

చవితియందు హోమము చేసిన సౌభాగ్యము, పంచమి యందు ధనలబ్ధి. నవమియందు విజయం-ఏకాదశియందు శివలోకప్రాప్తి కలుగుతాయి.

తుంబురునాథుని అర్చనలో పూర్వాది 4 దిక్కులందు జయ, విజయ, అజిత, అపరాజితలను అర్చించాలి. తెలుపు, ఎరుపు, పసుపు, నలుపు వర్ణముండాలి.

మామిడి చిగురులుంచిన కలశములు 10 దిశలలో ఉంచాలి. ఆయా బీజాక్షరములలో 4 దిక్కులందూ పుష్పములుంచి తూర్పుద్వారముద్వారా పడమర ముఖముగాలోనికి ప్రవేశించాలి.

తాంత్రిక విధానములో హోమమాచరించాలి.

అనంతరం శిష్యులకు దీక్షనివ్వాలి. నైవేద్యంపెట్టి ప్రసాదం అందరూ స్వీకరించాలి.

**శ్లో॥ సుసమే భూమిదేశౌతు ప్రస్తారం ప్రస్తరేచ్ఛుచిః ।**
**చతురస్రమతః కృత్వా ప్రస్తార రేఖముజ్వలం**
**కుర్యాదేకోనపంచాశత్ కోష్ఠకాన్తు సమాన్ శుభాన్ ॥**

**శతార్ధార్ధానాసీనాం పంచవర్గాంత బిందుకం**
**శిఖాసంభిన్న మూర్ధాంతం కళాఖ్యాం మధ్యకోష్ఠకే ॥**

అనంతరం శిష్యులు-దీక్షనిచ్చిన గురువును దక్షణ తాంబూలములతో సత్కరించాలి 49గడులున్న చక్రము లిఖించి, కోష్ఠమధ్యమందు "క్ష" లిఖించి, మాతృకాక్షరములను ఇట్లు లిఖించవలయును. తుంబురునాథుని 4గురు పరివార దేవతాబీజములు 5 విధములుగా మూలముండును. క్షాం, జం, భం, సం, హం తాంత్రిక ఆచమనమును ఆత్మతత్త్వాయ స్వాహా-విద్యాతత్త్వాయ స్వాహా-శివతత్త్వాయ స్వాహా అని చేయవలెను. వీటికి ముందుగా క్ష్మాం, క్ష్మాం, క్షౌం అను బీజంలను మూడింటికీ ఒక్కొక్కటి చేర్చవలెను.

శ్లో॥ **విదిక్ దిక్ సంష్టశోశేషు తత్పరశ్వే బహిరష్టసు**
**యశవర్గాన్య సేద్ దేవి ఐశాన్యదిషు తత్క్రమాత్ ॥**
**ఆగ్నేయాదిషు కోష్ఠేషు నపుంసక చతుష్టయం**
**ఐశాన్యాది క్రమాద్దేవి బీజద్వాదశకం న్యసేత్ ॥**
**తృతీయాంపంక్తి కోష్ఠేషు చతుర్ధే పంచవింశకం**
**ఐశాన్యాదిషు కోష్ఠేషు బీజాని క్రమశో న్యసేత్ ॥**
**ప్రస్తార మేవం ప్రస్తార్య స్వరావర్ణాంశ్చ .....భనే**
**బీజషోడ శికంచైవ ప్రోద్ధరేత్తు యధాక్రమం ॥**
**కాదిపం క్తిం పురాకృత్య క్రమాద్ వ్యస్తసమస్తకం**
**కోష్ఠె కాదశ బీజేన సంయుక్తం పంచవింశకమ్ ॥**

వారి బీజాక్షరము వరుసగా మః-ఈః-క్రోం-క్షైం-క్షూం





| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఛ | చ | జ | ఘ | గ | ఖ | క |
| జ | ఞ | ఇ | ఆ | అ | మ | భ |
| ఝ | ఈ | ల | ర | య | అః | బ |
| ఙ | ఉ | వ | క్ష | హ | అం | ఫ |
| ట | ఊ | శ | ష | స | ఔ | ప |
| ఠ | ఋ | ఎ | ఐ | ఒ | ర | న |
| డ | ఢ | ణ | త | థ | ద | ధ |

ఇందు తుంబురనాధుడు కర్ణికయందు అనగా మధ్య స్థానమందు "క్ష" రూపముగా నుండును. పూర్వాది 4దిశలందు జయ, విజయ, జయంతి, అపరాజితలుందురు అస్త్రమాయ, అంకుశ, గాయత్రి-సావిత్రి-దూతికలుగా నుందురు.

ఆత్మతత్వమును అధోభాగమునందు-విద్యా తత్వమును శరీర మధ్యభాగమందు-శివతత్వమును శిరస్సునందు న్యాసము చేయవలయును. యోనిముద్రను ప్రదర్శించవలయును. -తుంబురనాధ శివధ్యానము.

శ్లో॥ **చతుర్వక్త్రం అష్టభుజం చతుష్కాయం త్రిలోచనం**
**నాగయజ్ఞోపవీతంతు శూలపాణిం గదాధరం ॥**
**ముకుటేన విచిత్రేణ శశాంక ధృతశేఖరం**
**శక్తీనాంతు ప్రియందేవం పాశంకుశ కరప్రభం**
**దివ్యాంబరాత పత్రేణ దివ్యస్రగ్గంధ లేపనం**
**దేవ దేవం సదాధ్యాయేత్ సూర్యకోటి సమప్రభం ॥**

## జయా ధ్యానం :-

శ్లో॥ క్షీరోద ఫలసంకాశాం వ్యాఘ్రయజ్ఞోపవీతినీం
ప్రేతారూఢాం చతుర్వక్త్రాం గదాఖేటక ధారిణీం ॥
దివ్యాంబరాతపత్రేణ హారకేయూర భూషితాం
దేవదేవీం జయాంధ్యాయేత్ దీప్యమానాంస్య తేజసా ॥

## విజయా ధ్యానం :-

శ్లో॥ దేవస్యాభిముఖో మంత్రీ సస్మితోత్ఫుల్లలోచనాం
దాడిమీ కుసుమప్రఖ్యాం సురగోపక సప్రభాం ॥
చాపోద్యత కరాంఘోరాం మత్స్యమాంస సురాప్రియాం
ఉలూకే సంస్థితాం దేవీం హారకేయూర భూషితాం
రక్తాంబ రాతపత్రేణ విజయాం సిద్ధిదాం స్మరేత్ ॥

## జయంతీ ధ్యానం :-

శ్లో॥ ధాతుచామీ కరప్రఖ్యాం పీతమాల్యాంబర ప్రియాం
ఘంటా ఖట్వాంగ ధరీం దేవీం ఆశ్వారూఢాం మహాబలాం ॥
సూర్యాయుత ప్రతీకాశాం సర్వాభరణ భూషితాం
జయంతీ ధ్యాయతిక్షిప్రం సిద్ధిమాప్నోతి పుష్కలాం ॥

## అపరాజితా ధ్యానం :-

శ్లో॥ భిన్నాంజన సమప్రఖ్యాం శర్వరీ తిమిరప్రభాం
కృష్ణకౌశేయ సంవీతాం ముక్తికామిని భూషితాం ।
దివ్యం విమానమారూఢాం గదాఖేటక ధారిణీం
మహారావాది నిర్ఘోషైః చింతయేద పరాజితామ్ ॥

ఈవిధముగా ధ్యానించి పూజించవలయును. అనంతరమూ నిత్యము హృదయమందుకాని, ఎడమచేతియందుకాని భక్తితో పూజించవలయును.





సిద్ధినికోరువారు నిత్యము మనస్సులోకాని, శంఖమందు, తాబేటిచిప్పయందు, ముత్యమునందు సువర్ణ-తామ్రమూర్తులయందు పూజించవచ్చు. గంధమండలము లిఖించి, లేదా భస్మమండలము లిఖించి, ఆవాలతో పూలతో పూజించవచ్చు. యోనిముద్రా ప్రదర్శన చేయాలి. అపుడు సాధకుడు అన్ని అపాయముల నుండి రక్షింపబడతాడు.

శ్లుం-యాం-యాం-మం-క్షాం ఈ పంచబీజములు అన్ని తంత్ర సంప్రదాయములలోనూ చాలా మహత్తరమైనవి క్ష్మః (మః)-ఈః-క్రోం-క్షేం-క్షూం సాధనయే ముఖ్య కారణము. గ్రంథములు సహాయకములు మాత్రమే. నియమములు చాలా కఠినమైనవి. నియమసాధన లేనివారికి సిద్ధి కలుగదు. జననాంగమునకు బొడ్డుకుమధ్య మూలకందమున్నది ఇచటనుండియే శరీరమంతయూ 72 వేల నాడులు వ్యాపించియున్నవి. నాభికమలమే మధ్యస్థానమగుచున్నది. ఇందున్న కర్ణికారంధ్రముచివర ఊర్ధ్వగామిని అగుకళ ఉన్నది. ఇది జల-ఆకాశతత్వములతో కూడినదై “వాలాగ్రశత భాగకం” అనగా తలవెంట్రుకకొన 100 భాగములు చేసినచో ఎంత ఉండునో అంత సూక్ష్మరూపమున దేవుడు జీవరూపమున నివసించి యున్నాడు. ఇడానాడి ఎడమభాగము నందుండును. పింగళ కుడిభాగము నందుండును. ఈ రెండింటి మధ్య సుషుమ్నా నాడియుండును. ఇడానాడి శుభకార్యముల నిమిత్తము వినియోగింపబడును. పింగళానాడి అభిచార కర్మలందుపయోగించును. సుషుమ్న కేవలం మోక్షసాధనకుపయోగించును.

ఎడమ అరచేతిలో చంద్రునిభావించి పంచబీజములు గోరోచనముతో లిఖించి జపముచేసిన ఆకర్షణ-వశీకరణములు సిద్ధించును. మారేడు ఫలముతో హోమంచేసిన ధనలబ్ది. ఎడమచేతితో జపమాల త్రిప్పవలెను. మానవుడు రోజుకు 21,600 శ్వాసలు శ్వాసించును. బీజమండలములో నున్న మధ్యబీజము “క్ష” చాలా ప్రభావంతమైనది. ఇది సకల సిద్ధులను ఇచ్చు తుంబురునాధ శివుని వామవిధానములోని బీజము.

ఇది సర్వతో భద్ర-మహాసమ్మోహన బీజయంత్రములను మథించి శుక్రాచార్యునికి ఉపదేశింపబడినది. ఇది యోగులకు మాత్రమే ఉపదేశింప తగినది. 'హ్ర్యాం' అను ఏకాక్షర బీజముకూడా వీణాశిఖతంత్రములోని గొప్ప బీజమగుచున్నది. ఇది 3 లక్షలు జపించిన సిద్ధించును. (సుమారు 21 గంటలు జపించిన 3 లక్షలగును.

శీఘ్ర మంత్రసిద్ధికి-మంత్రసంస్కారములు చేయవచ్చు. పల్లవములు చేర్చి జపవిధులు అభీష్టానుసారముగా ఆచరించవచ్చు. ముద్రాప్రదర్శన తప్పనిసరిగా చేయాలి.

॥శివార్పణమస్తు॥



# జ్ఞాన సంకలినీ తంత్రం

ఓం నమశ్శివాయ

# జ్ఞాన సంకలినీ తంత్రం

**శ్లో॥ కైలాస శిఖరాసీనం దేవదేవం జగద్గురుం**
**పృచ్ఛతిస్మ మహాదేవీ బ్రూహి జ్ఞానం మహేశ్వర ॥**

హిమాలయ పర్వతములందున్న కైలాసములో సుఖాసీనుడై యున్న పరమేశ్వరుని, మహాదేవి ఇట్లు ప్రశ్నించినది. స్వామి సృష్టి మొ॥ విషయముల గూర్చి జ్ఞానబోధ చేయవలసినదిగా కోరుచున్నాను. అపుడు ఈశ్వరుడు ఈ తంత్రమును బోధించెను.

అవ్యక్తమునుండి సృష్టిపుట్టినది. ఇదియే బ్రహ్మజ్ఞానము. ఓంకారము నుండి 14 విద్యలు ఉద్భవించినవి. బ్రహ్మజ్ఞానము కలుగుటయే అన్ని విద్యలకూ లక్ష్యమగుచున్నది. వేదశాస్త్ర పురాణములు వేశ్యలవంటివి. శాంభవీ విద్య కులస్త్రీ వంటిది. బహుగోప్యముగా అంతఃపురమునందే యుండును. మానవదేహమునందే సకలవిద్యలు-సమస్త దేవతలు-సర్వతీర్థములు ఉన్నవి. వీటిని గురుముఖముగా తెలుసుకొన వలయును.

అధ్యాత్మ విద్యయే మానవులకు సౌఖ్యమును మోక్షమును ఇచ్చును. కర్రలోపల అగ్ని-పుష్పమునందు పరిమళము-పాలలో అమృతము ఎట్లున్నవో ఈ దేహమునందు దేవుడు పుణ్యపాపరహితుడై వెలుగొందుచున్నాడు. ఇడా నాడి గంగానది-పింగళ యమున-సుషుమ్నయే సరస్వతి ఇది అంత ర్వాహినిగా యున్నది. ఇందు స్నానము చేయుటయే సర్వపాప పరిహారము.

## ఖేచరీ ముద్ర :-

**మనః స్థిరం యస్యవినావలంబనం**
**వాయుః స్థిరోయస్యవినా నిరోధనం ॥**
**దృష్టిః స్థిరాయస్వ వినావలోకనం**
**సఏవముద్రా విచరంతి ఖేచరీ ॥**





**తా :** ఆలంబన రహితమైన స్థితిలో మనస్సు స్థిరముగా నుండుట-నిరోధించకనే వాయువు స్థిరమగుట చూడక చూపుస్థిరముగుట ఖేచరీముద్ర అందురు.

## శాంభవీ ముద్ర :-

**శ్లో॥ బాలస్య మూర్ఖస్య యద్దైవ చేతః**
**స్వప్నేన హీనోపి కరోతి నిద్రాం ।**
**తతో గతఃపధో నిరావలంబః**
**సాఏవ విద్యా విచరంతి శాంభవీ ॥**

**తా :** బాలునకు, మూర్ఖునకు ఏవిధముగా కలలు రాని నిద్రను మనస్సు కలిగించుచున్నదో, ఆధారశూన్యమైన స్వచ్ఛమైన చిత్తమే శాంభవీవిద్య అగుచున్నది. ఇది సాధనకు పరాకాష్ట.

**పృధివ్యాధి పంచభూతములకు ప్రత్యేక గుణములున్నవి.**

మానవ శరీరములలో ఎముకలు-మాంసం-గోళ్ళు-చర్మము-వెంట్రుకలు ఇవి పృధివీగుణము కలవి.

శుక్రము-శోణితం-మజ్జ- మలం-మూత్రం నీటి గుణము కలవి.

ఆకలి-నిద్ర-తృష్ణ-క్లాంతి-ఆలస్యం ఇవి తేజో గుణములు కలిగినవి.

ధారణం-చలనం-విసరుట- ముడుచుకొనుట-చూచుట-వాయుగుణము కలవి. కామం-క్రోధం-సిగ్గు-మోహం-లోభం-ఆకాశ గుణములు కలిగినవి.

ఆకాశమునుండి వాయువు పుట్టినది. వాయువులో రవి రవినుండి జలము-జలమునుండి భూమిపుట్టినవి. భూమినీటిలో లీనమగును. నీరు సూర్యునియందు సూర్యుడు వాయువుయందు, వాయువు ఆకాశమునందు లీనమగును. పంచతత్త్వముల వలన సృష్టి జరుగుచున్నది. పంచతత్త్వములకు అతీతమైనది నిరంజనం.

స్పర్శ-రసన-వాసన-దృష్టి-వినుట ఈ పంచేంద్రియములు మనస్సు సాధనముగా చేసుకొని పనిచేయును.

బ్రహ్మాండముయొక్క లక్షణమంతయూ సూక్ష్మరూపముగా మానవశరీరములో నిబిడీకృతమై యున్నది Macrocosm of universe Posited in the Human being as Microcosm.

సాకారమంతయూ నశించును. నిరాకారము నశించదు. అందుచేతనే సర్వప్రయత్నముగా సాకారమును విడచి పెట్టవలయును.

శరీరమునందు సప్తధాతువులున్నవి శుక్రం-శోణితం-మజ్జ-మేదస్సు-మాంసం-అస్థి-చర్మము ఇవి సప్తధాతువులు. ఆత్మ-మనస్సు సంయోగము వలనే జ్ఞానము కలుగుచున్నది. మనస్సు శూన్యమైనచో, లయమైనచో పరమాత్మ అగుచున్నది.

రక్తధాతువు తల్లినుండి, శుక్రధాతువు తండ్రినుండి సంక్రమించును. ప్రాణము శూన్యధాతువు. వీటివలెనే గర్భమునందు పిండమేర్పడును.

అవ్యక్తము నుండి ప్రాణము, ప్రాణమునుండి మనస్సు మనస్సు నుండి వాక్కు ఏర్పడుచున్నవి. తాలుమూలమునందు (దవడలు) చంద్రుడు, నాభిమూలమునందు సూర్యుడు ఉన్నారు. సూర్యునిపైన వాయువు, చంద్రునిపైన మనస్సు ఉన్నని, పాతాళమునందు శక్తి, బ్రహ్మాండమునందు శివుడి అంతరిక్షమునందు కాలము ఉన్నవి. కాలమువలెనే వృద్ధాప్యము ఏర్పతున్నది. ప్రాణము తన అస్తిత్వముకొరకు ఆహారమును కోరును దానిని అగ్నిని భక్షించుచున్నాడు. జాగ్రత్-స్వప్న-సుషుప్తులు, వాయువు ఇందువలననే సంభవించుచుచున్నవి. పాపకర్మలను మనస్సే చేయుచున్నది.

(భ్రాంతి బుద్ధి కలవాడు జీవుడు-భ్రాంతిలేనివాడు శివుడు, ఇది తీర్థమని, అది క్షేత్రమని తామసజనులు దేశమంతా తిరుగుచున్నారు. ఆత్మతీర్థము నందే మోక్షమున్నది.





4 వేదములను-6 శాస్త్రములను మధించి, సారమును (నవనీతం) యోగులు సేవించిరి. మజ్జిగను పండితులు సేవించుచున్నారు.

## తక్రం పిబంతి పండితా:-

అన్ని శాస్త్రములు అందరి నోళ్ళలోనూబడి ఉచ్ఛిష్టములైనవి. బ్రహ్మజ్ఞానమునకు ఉచ్ఛిష్టంలేదు. అది అవ్యక్తమై చేతనా స్వరూపమైనది.

తపస్సు, తపస్సు కాదు. బ్రహ్మచర్యమే ఉత్తమ తపస్సు, ఊర్ధ్వ రేతస్సు కలవాడు దేవతాస్వరూపమే కాని, మానవుడు దేవతాస్వరూపమే కాని, మానవుడు కాదు.

ధ్యానము, ధ్యానముకాదు. శూన్యమైన మనస్సే ధ్యానస్థితి-అందుచేతనే మోక్షములక్ష్మి సిద్ధించును.

**శ్లో॥ శ్లోకార్ధంతు ప్రవక్ష్యామి యదుక్తం తత్త్వదర్శిభిః ।**
**సర్వచింతా పరిత్యాగో నిశ్చింతో యోగ ఉచ్యతే ॥**

**తా :** సర్వ చింతలను విడుచుటే యోగము. ఒక నిమిషము గాని, అరనిమిషముగాని సమాధిస్థితిపొందిన, వందజన్మలపాపములు నశించును.

**చలచిత్తమునందు శక్తి ఉండును. స్థిరచిత్తమునందు శివుడుండును.** స్థిరచిత్తమును సాధించవలయును. ఊర్ధ్వశక్తి కంఠమునందు అధఃశక్తి గుదస్థానమునందు, మధ్యశక్తి నాభిస్థానమందు ఉండును. శక్త్యతీతము నిరంజనం, శరీరమున శిరస్థానము బ్రహ్మలోకము, కిందస్థానము పాతాళముపైన వేళ్ళు ఉండి, కొమ్మలు కిందకు ఉన్న వృక్షాకారమే ఈ శరీరము.

హృదయమునందు ప్రాణవాయువు గుదమునందు అపానవాయువు, బొడ్డువద్ద సమానవాయువు, కంఠమునందు ఉదానవాయువు, శరీరమంతటా వ్యానవాయువు సంచరించును. తొమ్మిది ద్వారములు ప్రత్యక్షముగా శరీరమునందు కనిపించును. మనస్సు పదవది.

ఇడా-పిగళా-సుషుమ్నానాడులు పైకి ప్రసరించును గాంధారీ-హస్తిజిహ్వా-వ్రనవా-గమనాయుతా-అలంబున యశనాడులు కుడిభాగమునందునూ, కులము-శంఖీనీ-ఎడమ భాగమునందును సంచరించును. ఈ నాడులనుండియే 72వేల నాడులు శరీరమంతయూ వ్యాపించియున్నవి. యోగులకు సిద్ధినిచ్చు జ్ఞాననాడి వేరుగా యున్నది.

బ్రహ్మరజోగుణ స్వరూపుడు. విష్ణువు సత్త్వగుణస్వరూపుడు. రుద్రుడు క్రోధభావము కలవాడు. ఒకేరూపము బ్రహ్మవిష్ణు మహేశ్వరులుగా వెలుగొందుచున్నది. నానాభావముచూచు మనసుకు ముక్తి లభించదు.

బ్రహ్మ వీర్యరూపుడు-విష్ణువు వాయురూపుడు-రుద్రుడు మనోరూపుడు.

సంసర్గమువలన అనేక దోషములు సంభవించును. నిస్సంగములో అనేక గుణములున్నవి. అందుచేత యతులు, **ఎవరితోనూ సాంగత్యము చేయరాదు.**

అకారము ఋగ్వేదము-ఉకారము యజుర్వేదము మకారము సామవేదము-ఈ మూడింటి కలయిక అథర్వవేదము.

ఓంకారము ప్లుతము 3 నాదములు కలసినది. ఏకాక్షర బ్రహ్మమే ఓంకారము. చింత-నిద్రలేక స్థిరాసనమందు యోగి ప్రణవము జపించవలయును. ఇంతకంటే వేరు మార్గము లేదు.

**శ్లో॥ యః ఇదం పఠతే నిత్యంశృణోతి చదినేదినే ।**
**సర్వపాప విశుద్ధాత్మా శివలోకం సగచ్ఛతి ॥**

॥శివార్పణమస్తు॥





# డామర తంత్రం

# డామర తంత్రం

॥ఓం నమః

శ్లో॥ వ్యోమవక్త్రం మహాకాయం ప్రళయాగ్నిసమప్రభం ।
అభేద్య భేదకంస్తౌమి భూతడామర నామకమ్ ॥
త్రైలోక్యాధిపతిం రౌద్రం సురసిద్ధ నమస్కృతం
ఉన్మత్తభైరవం నత్వా పృచ్ఛత్యున్మత్త భైరవీ ॥

**తా :** ఆకాశమే ముఖముగా కలిగి, మహాకాయుడై ప్రళయాగ్ని సమమైన తేజస్సు గలవాడైన భూతడామరుడనే పేరు కలిగిన, అభేద్యభేదకుడైన ఉన్మత్తభైరవునకు నమస్కరించుచున్నాను. మూడు లోకములకు అధిపతి. దేవతలు, సిద్ధులచేత పూజింపబడువాడు. రుద్రస్వరూపుడు అయిన ఉన్మత్తభైరవునికి నమస్కరించి ఉన్మత్తభైరవి ఇట్లు ప్రశ్నించినది.

**భైరవ్యువాచ :-**

శ్లో॥ కథంయక్షా నరానాగాః ప్రమథాదయః
జంబూద్వీపే కలౌసిద్ధిం యచ్ఛంత్యే తే నరాంగనా ॥
యేన్యే పాపరతా మిధ్యావాదినః శీలవర్జితా
సాలస్యాయే నరాస్తేభ్యః సాహాయ్యం కురుస్వయం ॥
కేనోపాయేన నశ్యతి కలౌదుష్ట ధరాశయః
లభ్యంతే సిద్ధయః సర్వామోక్ష పద్ధతయః శుభాః ॥

**తా :** కలియుగమునందు జంబూద్వీపముతో యక్షనర–నగ–కిన్నెర–ప్రమథాదులు సిద్ధిని ఎట్లు పొందెదరు. పాపరతులు–మిధ్యా వాదులు–శీలరహితులు–ఆలస్యము మొ॥ దుర్లక్షణములు కల నరులు ఎట్లు మోక్షమును సిద్ధిని పొందగలరో వివరించవలసినదిగా ప్రార్థించు చున్నాను.

శ్లో॥ సిద్ధయోప్యణి మాద్యాశ్చ మహాపాతక నాశికాః
అన్యాన్నా శనతః పాపమన్య స్త్రీగమనాద్విజం ।





కథం నశ్యంతి దేవేశ హేలయా నరకంతమః
దూరాదాగత్య కామా ర్తా బలదాలింగయంతికం ॥
బ్రహ్మేశ శక్రప్రముఖా మారితావా కథంప్రభో ॥
పునఃకేన ప్రకారేణ మృతాజీవంతి నిర్జరాః ॥

**తా :** అణిమాది సిద్ధులు ఎట్లులభించును? మహాపాపములు ఎట్లునశించును? పరాన్నభోజనం–పరస్త్రీగమనం దోషములు ఎట్లుపోవును? దూరముగానున్న వ్యక్తిని ఆకర్షించుట ఎట్లు? దేవతావశీకరణ విధానమేది? మానవుడు ఎట్లు దేవత్వమును పొందును. దయచేసి అన్నియు వివరించుము ప్రభూ।

**ఉన్మత్త భైరవ ఉవాచ :-**

శ్లో॥ క్రోధాధీశం వ్యోమవక్త్రం వజ్రపాణిం సురాంతికం।
వక్ష్యేనత్వా తతస్తత్ర భూపతిం భూతడామరం ॥
తవస్నే హాన్మహాదేవి కథ్యతేఽ కథ్యమద్భుతం
యత్సురైర్దుర్లభం స్వర్గే మర్త్యేమత్యై ముముక్షుభిః ।
నాగలోకే తథానాగైః తచ్ఛృణుష్వ మమప్రియే
యస్యజ్ఞానం వినాక్వాపి నారీణాం నిగ్రహో భవాత్ ॥
యక్షిణో నైవగచ్ఛంతి సిద్ధిమిష్టాం శృణుష్వతత్ ॥

**తా :** దేవతలకు కూడా దుర్లభమైన తంత్రమును, నీకు ఉపదేశించు చున్నాను. నాగులు–నరులు–యక్షులు ఈ తంత్రశాస్త్రముచే, ఇష్టసిద్ధిని పొందగలరు.

శ్లో॥ అథాతః సంప్రక్ష్యామి సుగోప్య మనుముత్తమం
సురనామాధ భూతానాం మరణంయేన సిధ్యతి ।
విషం వజ్రజ్వాలేన హనయుగ్మం తతః పరం
సర్వభూతాన్ తతఃకూర్చం అస్త్రాంతం మనుమీరితం

అస్యవిజ్ఞాన మాత్రేణ క్రోధేశాద్రోమ కూపతః
వజ్రజ్వాల్యాః ప్రజాయంతే శుష్యంతి ప్రమథాదయః ॥
బ్రహ్మేశ శక్రప్రముఖా నీతాః సూర్యమశాసనమ్ ॥

**తా :** "ఓం వజ్రజ్వాలేన హనహన సర్వభూతాన్ హుంఫట్" ఈ మంత్రము చైతన్యవంతమైనచో క్రోధభైరవుని రోమకూపముల నుండి, వజ్రజ్వాల అనుశక్తి ఉద్భవించును. ప్రమథాధి గణములు శక్తిహీనములగును. దీనివలన బ్రహ్మ-శివ- ఇంద్రాది దేవగణములు ఈ శక్తిశాసనములోకి వచ్చును.

శ్లో॥ విజ్ఞానా కర్షిణీ మంత్రం భాషశేఽ తోఽ తివిస్మితా
తారంబ్రహ్మముఖేప్రోక్తా శరయుగ్మాంత మీరితం ॥
అస్యభాషిత మాత్రేణ వజ్రజ్వాలా వినిసృతాః
మృత సంజీవనీవిద్యా మృతప్రాణ ప్రదాయినీ ॥

**తా :** ఇపుడు అత్యంత విస్మయం కలిగించు "విజ్ఞానా కర్షిణీ" మంత్రము చెప్పెదను. "ఓం వజ్రముఖే సర-సరఫట్-" దీని ఉచ్చారణ మాత్రముచేతనే వజ్రభయము తొలగును. ఇది మృతసంజీవనీ విద్య" భూత బాధ తొలగును.

శ్లో॥ పంచరశ్మిం సముద్ధృత్య సంఘట్టే తిద్విధాపదం
మృతానితి పదంపశ్చాత్ జీవయాగ్ని వధూస్మృతః ॥
అస్వభాషిత మాత్రేణ మూర్ఛితా భూతదేవతాః
స్తంభితా వేపమానాశ్చ ఉత్తిష్ఠంత్యతి విహ్వలాః ॥

**తా:** ఓం సంఘట్ట-సంఘట్ట-మృతాన్ జీవయస్వాహా భూతాది సమస్త దేవతలు మూర్ఛపొందగలరు. అటువంటి శక్తివంతమైన మంత్రమిది.

శ్లో॥ ఏకవృక్షే దేవగేహే వనేవజ్రధరాలయే
నిమగ్నా సంగమేవాపి పితృభూమ్యావధాపివా ॥





సిద్ధ్యంతి భూతభూతిన్యః నృణామిష్ట ఫలప్రదాః
మారణం బ్రహ్మ ముఖ్యానాం భూతప్రత్యయ కారకం ॥
పాలేయం హనుయుగ్మంచ సర్వమారయ మారయ
వజ్రజ్వాలేన కూర్చాస్త్రమయం మంత్ర్య సురాంతక
త్రింశత్సహస్ర జపేన వజ్రజ్వాలా కులాదిశః

**తా :** వృక్షముక్రింద-దేవాలయములో-అరణ్యములో-శివాలయములో-నదీ సంగమంవద్ద-స్మశానమందు జపసాధన చేయుటవలన భూత-భూతనీ విద్యలు సిద్ధించును. మానవులకు అభీష్టము సిద్ధించును. బ్రహ్మాది దేవతలను మారణము చేయు ప్రక్రియ వినుము. ఈ మంత్రముచే అసాధ్యము సిద్ధించును. "ఓం హనహన సర్వం మారయ మారయ వజ్రజాలేన హుంఫట్" ఈ మంత్రము సమస్తదేవతలకు అంతమొనరించును. ఇది 30 వేలు జపించిన అన్ని దిశలయందు వజ్రజ్వాలలుపుట్టి ఆందోళన కలిగించును.

# భూతినీ సాధన మంత్రములు

ప్రాలేయం శ్రీ శశీదేవ్యా అనాది శ్రీ తిలోత్తమా
సనాదీం శ్రీమనుస్మృత్య యుక్తం కాంచనమాలయా ॥
విషంశ్రీ వర్మసంయుక్త మాభాష్య కులహారిణీ
తారం వర్మసమాయుక్తాం రత్నమాలేతి పంచమీ ।
తాంసితి రంభాఖ్యాం విషంశ్రీమూర్వశీం వరా
అనాదిబీజ మాభాష్య భూషణీత్యుక్తా స్సరసః క్రమాత్ ॥

**తా :** ఓం శ్రీ తిలోత్తమా॥ ఓం హ్రీం కాంచమాలా॥ ఓం శ్రీంహుం కులహారిణి॥ ఓంహుం రత్నమాలా॥ ఓం హుం రంభా॥ ఓం శ్రీం ఊర్వశీ॥ ఓం శ్రీం భూషణీ॥ ఇవన్నియూ ఆయాభూతినీ సాధన మంత్రములు.

